ఓమ్

శ్రీ హయగ్రీవాయనమ

# శ్రీ త్యాగరాజ చరితామృతమ్



గరాజస్వామినః





# శ్రీ త్యాగరాజ చరితామృతమ్


వ్యాకరణాచార్య, వ్యాకరణ శిరోమణి,

సర్వతంత్ర విశారద, Ex ప్రిన్సిపాల్ (Tenali) Sanskrit College

బ్రహ్మశ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిభిః


పరిష్కృతమ్


ఈ కావ్యమును నరసరావుపేట శ్రీ త్యాగరాజ శ[illegible] వార్షికోత్సవ పుష్పముగ వ్రాయించినవారు శ్రీ కవికొండ[illegible] పురుషోత్తమ యోగి [illegible]

1949





[ప్రతులు [illegible] 47

రూపాయి పావలా

ఓమ్

[illegible]యాస్యాయనమః

# శ్రీ పరదేవతాష్టకమ్

౧

శ్లో॥ [illegible]యమానసుమఙ్గళాగ కేసరశుభఙ్గాక రే భగవతీ
చణ్డాంశుబింబవదఖణ్డారుణాభ శుకతుణ్డోపమానవసనా
[illegible]క్కృతాసురగణా పున్దర దేవముఖతుణ్డోపలాలనకరీ
కాణ్డభవ త్రిభువనావనా సుఖమఖణ్డాం సదాదిశతు మే

౨

శ్లో॥ శౌణ్డీరశుంభమదఖణ్డపటుర్విజితడిణ్డీరహాసలలితా
భణ్డాసురాత్మకరకణ్ఠాతినిర్వారణగాణ్డీవకాణ్డసదృశీ
దణ్డాయుధా దనుజదణ్డే గిరీశభుజదణ్డేన వేష్టితతను
శ్చణ్డీశుభందిశతుకాణ్డాగ్రధీస్సుమదశుణ్డాలమందగమనా

3

శ్లో॥ ఓఙ్కారరూపసదనాఙ్కా సురారిగణకఙ్కాళహారకలితా
శఙ్కాకులీనదురహఙ్కారమానవభయఙ్కర్త్రీ మదవతీ
కైఙ్కర్యవత్పురుషపఙ్కాదినిర్దళనటఙ్కాయమానచరణా
ఝఙ్కారిణీజఘనసఙ్గా శివాచమకలఙ్కా సదాదిశతు మే.

శ్లో॥ పఙ్కేరుహేనయవశఙ్కాకరీవపుషికఙ్కేళికాంతినిలయా
శ్రీఙ్కారిణీవరవృషాఙ్కప్రియాదనుజకఙ్కాళశోభితవపుః
లఙ్కేశసేవితమృగాఙ్కావతంసవిపులాఙ్కాసనేస్థితిమతీ
పఙ్కేజవైరివదనాఙ్కాసదాదిశతుశంకామితార్థవరదా.

౫

శ్లో॥ భృఙ్గీశ్వరాదినుతశృఙ్గారిణీ విజితభృఙ్గాళకాన్తికలితా
భఙ్గాయితాత్మనళిభఙ్గైరనఙ్గవిభవాఙ్గీ సుభృఙ్గీచికురా
గఙ్గాధరామరతురఙ్గాధిరాడ్గిరిభగఙ్గాచ్ఛకీర్తినిలయా
సఙ్గీతశాస్త్రనిపుణాఙ్గీకరోతు ముఖరఙ్గే మమాద్య వసతిమ్

౬

శ్లో॥ గాఙ్గేయపిఙ్గసదృశాఙ్గీ కురఙ్గమదశృఙ్గారితాఙ్గవిభవా
రఙ్గత్తరఙ్గయుతగఙ్గాభిశోభితసుమాఙ్గల్యరూపనిలయా
తుఙ్గాయితాత్మ హిమ శృఙ్గానుషఙ్గ సు మతఙ్గాఘ
చాపగమనా
శంగిర్నిధిర్మమరథాఙ్గస్తనీ దిశతు పిఙ్గాక్షి మధ్యరమణీ.

౭

శ్లో॥ నారాయణీ భువనభారయితాఘజనవారాశిశోషణరవి
ర్వీరాధి వీర శివదారాః కృపా హృదయ సారా సుమేరు
నిలయా
ధీరాపరాసుమశరీరాశివాక్షపితఘోరాసురాశుభకరీ
సారస్వతం విపుల మారా దుమా దిశతు గౌరీ పురారి
దయితా.

౮

శ్లో॥ ఉక్షారథగ్రహణదక్షావిపక్షబలశిక్షాఽక్షరాభగవతీ
సాఽఽర్తప్రపన్నపరిరక్షాక్రియాచరణదీక్షాసురారిదమనా
భిక్షాశివామనిజపక్షారథాంగసమవక్షోజకాంతికలితా
సా క్షేమదా మయి కటాక్షం కరోతు కరుణాక్షీ
ప్రభాత లలితా.

ఇత్థ[illegible] గ్రంథకర్తా.



కవికొండల పురుషోత్తమ దంపతులు

మనుమడు శ్రీ రాజా విష్ణు వెంకట సుబ్బారావు.

శ్రీ త్యాగరాజ స్వామి ఆరాధకులు.

శ్రీ త్యాగరాజ చరితామృతమును యక్షగానరచనా ప్రోత్సాహకులు,
రచయితకు సువర్ణ ఘంటాకంకణ ప్రదాతలు.

శ్రీ శివాయ గురవే నమః

# ఉపోద్ఘాతము.

వ్యాకరణాచార్య, వ్యాకరణశిరోమణి, సర్వతంత్రవిశారద,
(Ex) ప్రిన్సిపాల్ సంస్కృతకళాశాల, తెనాలి.
బ్ర॥ శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు.

శ్రీ త్యాగరాజ చరిత్రాత్మకమను నీకావ్యమును రచించినదిమాశిష్యుడు ఉభయభాషాప్రవీణ, చిరంజీవి, లంకా సీతారామశాస్త్రి. ఇతడు తెనాలిసంస్కృత కళాశాల యందు నావలన వ్యాకరణాలంకారాది శాస్త్రీయగ్రంథములను కడుశ్రద్ధాభక్తులతో నధ్యయనముజేసి యుత్తీర్ణులయిన బుద్ధిమంతులలో నొకడు. ఇతడీకావ్యమును భక్తిశ్రద్ధానైపుణ్యములతో సంస్కృతభాషయందు సులభశైలిని శ్రావ్యమైన వృత్తములతో రచించి, పరిశీలనార్థము నాయొద్దకువచ్చి యీమూలాగ్రము చదువగా వినియుంటిని. ఈగ్రంథములోని కథాభాగములు శ్రవణపేయముగా సహృదయ హృదయము నాకర్షించుచున్నవి.

ఇందలి నాయకుడు శ్రీనారదమహర్షి శిష్యుడును, శ్రీ రామచంద్రానుగృహీతుడును, మహాభక్తాగ్రేసరుడును, మహావైరాగ్యసంపన్నుడగు త్యాగరాజు. ఇతడే యీకృతిపతి. ఈ

చరితామృతము నొకసారి గ్రోలిన నెట్టి కఠినచిత్తుని హృదయ
మైనను గరుగకమానదు. ఈగ్రంథము కేవల పౌరాణిక శైలిని
గాక సరసమైనకావ్యశైలిని నాతిసంక్షేపవిస్తృతిగలదియై విష
య తిరోధానము నొనరింపక ద్రాక్షాశైలి నలరారుచున్నది.

దీనియందలి వర్ణనలు మహాకావ్యమందువలె నిర్దుష్ట
ములు. ఈగ్రంథమును పనునప్పుడు శ్రీమద్భాగవతములోని

శ్లో॥ నివృత్తతర్షైపగీయమానా
ద్భవౌషధా చ్ఛ్రోత్రమనోభిరామాత్ ।
క ఉత్తమశ్లోకగుణానువాదాత్
పుమాన్విరజ్యేత వినా పశుఘ్నాత్ ॥

అనుశ్లోకము స్మృతికివచ్చుచుండునుగాన పండితపామ
రులకు వారివారిచిత్తశుద్ధి తారతమ్యము ననుసరించి మహోప
కారకమని తలంచుట సత్యేతరముగాదు,

ఈవిద్వత్కవి యిందలిశ్లోకములకు నాంధ్రమున తా
త్పర్యమునుగూడ రచించుటచే సామాన్యులకుఁగూడ తన
గ్రంథమందలి చరితామృతమును గ్రోలుటకవకాశమిచ్చుట
మహౌదార్యమని తలచఁబడుచున్నది. ఈకావ్యమును పాఠ
శాలలయందు ఁబాఠ్యగ్రంథముగా నిర్ణయించిన విద్యార్థులకు
సులభముగా భక్తిజ్ఞానవైరాగ్యము లలవడును. శ్రీత్యాగ

రాజ శతతమ వార్షికోత్సవసందర్భమున నీగ్రంథమును రచించుటకు ప్రోత్సహించి ముద్రించుటకు తగు ద్రవ్యసహాయము నొనరించిన శ్రీకవికొండల పురుషోత్తమయోగిగారి భగవద్భక్తి వర్ణనాతీతము, నిరుపాధికము. ఇందలికృతినాయక శ్రీత్యాగరాజానుగ్రహపాత్రుడగు శ్రీసీతారామచంద్రమూర్తి కృతికర్తయగు ఉభయభాషాప్రవీణ, చిరంజీవి. శ్రీలంకా సీతారామశాస్త్రిని, కృతిప్రోత్సాహకులగు శ్రీకవికొండల పురుషోత్తమయోగిగారిని, రాజపోషకులను చిరాయురారోగ్యైశ్వర్య శ్రేయస్సులచే ననుగ్రహించుగాక.

మచిలీపట్టణము<br>
కొజ్జిల్లిపేట.<br>
19—10—49

ఇట్లు,

కంభంపాటి రామమూర్తిశాస్త్రి.



ఓం.

శ్రీ ద క్షి ణా మూ ర్త యే న మః

# అ భి ప్రా య ము.

గాయకసార్వభౌమ,

పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, బి. టి. యు.

శ్రీ "త్యాగరాజ చరితామృత" మను గ్రంథము 1947 సం॥ డిశంబరు నెలలో నరసరావుపేటలో శ్రీకవికొండల పురుషోత్తము యోగిగారిచే జరుపబడిన శ్రీత్యాగరాజస్వామి శతవార్షికోత్సవ సందర్భమున స్వామివారికి అంకితముకాబడినది. అప్పుడు సమావేశపఱుపబడిన సంగీత, సాహిత్య, సభలలో సంగీతసభకు నేను అధ్యక్షత వహించినందువల్ల గ్రంథకర్త ఉభయభాషాప్రవీణ, వేదాంతశిరోమణి, శ్రీ లంకాసీతారామ శాస్త్రిగారున్నూ, ప్రోత్సాహకులు శ్రీకవికొండల పురుషోత్తము యోగిగారున్నూ నాకు సుపరిచితులైరి.

ఇట్టి ఉద్గ్రంథమును అచ్చువేసి భక్తజన తరణోపాయముగ లోకమునకు అందజేయుట కడుంగడు ప్రశంసనీయము. దేవభాషయగు గీర్వాణమునందు ప్రథమతః సులభశైలిని కావ్యరూపమున స్వామివారి పవిత్రచరిత్రను అవతరింపజేసి గాయక లోకముయొక్క నిరంతరకృతజ్ఞతకు పాత్రులైన శ్రీ శాస్త్రిలగారు వీరు ధన్యతములు.

ఈగ్రంథముభారతభూమియందు స్థిరస్థాయిగ కీర్తిగాంచి ముముక్షువులకు ఐహికాముష్మిక సుఖప్రదము అగుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
బుధజనవిధేయుడు
పారుపల్లి రామకృష్ణయ్యపంతులు.



శ్రీ హయగ్రీవాయ నమః

# అవతరణిక

'పిత్ర్య శ్రేయః కావ్యమ్' అను నార్యోక్తిననుసరించి నేనీకావ్యమును సంస్కృతభాషలో రచించుటకుండ నిడు. నేను పాఠశాలలోఁ బండితుఁడుగఁ బ్రవేశించినది మొదలు నాతో మైత్రినొందిన శ్రీ కవికొండల పురుషోత్తముపంతుల గారి ప్రోత్సాహము నాయీరచనకు ముఖ్యకారణము. శ్రీ పంతులుగారు శ్రీత్యాగరాజభక్తులు; నారాధకులును. వీరి గ్రామమున ననేకవత్సరములనుండి త్యాగరాజవార్షికోత్సవములఁ జరుపుచు 'శ్రీత్యాగరాజ శతవార్షికోత్సవ' సందర్భమున నాచే నీకావ్యమును గీర్వాణభాషలో నొకనెలరోజుల వ్యవధిలో వ్రాయించిరి. నేనును పసితనపు బల్కులట్లవకతవ కలుగవ్రాసితిని; దానిని సాధ్యమైనంతవఱకు సద్గురువర్యులగు శ్రీ కంభంపాటి శ్రీరామమూర్తి శాస్త్రిలవారు (వ్యాకరణాచార్య) దిద్ది సరిచూచిరి; కాని యేమరుపాటున వారుదిద్దక వడలిన నాతప్పులను, ముద్రణలోని ప్రమాదములను పాఠకులు సహృదయమునఁ దెలిపిన సవరించుకొనగలనని మనవిఁజేయుచున్నాను.

ఇఁక నాయీగ్రంథమునకు శ్రీమాన్ వి, శ్రీవరాహనరసింహాచార్యులవారి త్యాగరాజ చరిత్రయు; తిరువయ్యూరులోజరిగిన శతవార్షికోత్సవసంచికయు మాతృకలు;

వీనినాధారముగఁ జేసికొని యీగ్రంథమును పంచసర్గాత్మకముగ ముగించితిని. కాని దీనిని వ్రాయించిన పంతులవారికాధిదైవికములు సంఘటించుట గొంతకాలము నిలుపుదలయయ్యెను. ఇంతలో శతవార్షికోత్సవ సంవత్సరమున గలిగిన సఖ్యకారణముగ శ్రీ చిల్లర సాంబయ్య పంతులు (రివెన్యూతహశీల్ దార్)గారితో నీవిషయమునంటిని. వెంటనే వారు నాకీ తెరవుజూపి సలహానిచ్చిరి. వారుచెప్పినప్రకారము నాకుముఖ్య మిత్రులును, మచ్ఛ్రేయోభిలాషులును, ధర్మమూర్తులునగు శ్రీ కపలవాయి శ్రీకాశీరామారావుగారు, దమ మిత్రులతోగలిసి యాలోచించి మఱి కొందరిసహాయముతో నా యీగ్రంథమును ముద్రింపించిరి. దయతో నా యీగ్రంథమును సరిజూచి యుపోద్ఘాతమును వ్రాసియిచ్చిన మద్గురువర్యులకు బ్రణమిల్లి, మాతృకా గ్రంథరచయితలకుఁ గృతజ్ఞుడనై ముద్రింపించిన ధర్మమూర్తుల వంశము లాచంద్రతారకాభివృద్ధి నొందఁగఁగలందులకు శ్రీరామచంద్ర కరుణాకటాక్షమును గోరుచున్నాను.

నరసరావుపేట
మునిసిపల్ హైస్కూలు,
25-10-49

ఇట్లు విధేయుడు,
లంకా సీతారామ శాస్త్రి,
(ప్రధానాంధ్రోపాధ్యాయుడు)

## శ్రీ త్యాగరాజ చరితామృత' కావ్యమధికృత్య మదీయా
## అభినందన నివేదికా పత్రికా

శ్లో॥ 'శ్రీ త్యాగ రాజ చరితా మృత' నామ్నా
గీర్వాణ మాంధ్ర మధిగత్య చ వాణ్యా।
సంవిరాజిత మిదం హి సుకావ్యం
పండితా ద్యఖిల పామర హృద్యమ్॥

శ్లో॥ శ్రీ త్యాగరాజ చరితం బహుభి స్తత్
కీర్తితం కవివ రైర్బహుధా హి
తే ష్వేక మేవ చరితేషు యథార్థం
భావ్యమాన మితి సూక్తి రయోగ్యా॥

శ్లో॥సీతారామ బుధాగ్రణీః కవివరః శ్రీ త్యాగరాజస్య య
చ్చారిత్రంకృతవాంత్సుకావ్యరచనా శైల్యామృదూక్త్యాహి తత్
తస్య గ్రంథ విధాతు రన్యవిదుషా మధ్యేత్య పుంసా మిహాఽ
ముత్రాఽఽభోగ ఫలాభి సంధి కలనా ద్వైశిష్ట్య మాప్నోతు వై॥

శ్లో॥ రామ ఏవ పురుషోత్తమ ఈశః
స్వాభిధాన గుణినం కవివర్యం।
కావ్యనాథ మపి తద్గుణ యోగ్యైః
పాతు నిత్య మనయో ర్హృది కామ్యైః॥

మచిలీపత్తనమ్
స్వస్తిశ్రీ చాంద్రమాన విరోధి,
ఆశ్వయుజ బ॥ ౧౦ సోమవాసరం
17—10—49

ఓం తత్సత్
ఏవం దివ్యనామగాయనః
హరినాగభూషణం.

ఈ గ్రంథమునకు

# మహారాజపోషకులు

1 శ్రీ కవికొండల పురుషోత్తము పంతులుగారు (Retired High School Teacher)

# రాజపోషకులు

1 శ్రీ సత్యనారాయణ ట్రాన్సుపోర్టు లిమిటెడ్ వారు
2 శ్రీ నాగసరపు సుబ్బాయశ్రేష్ఠిగారు
3 శ్రీ తాడేపల్లి వేంకటనారాయణశ్రేష్ఠిగారు
4 శ్రీ కపలవాయి కాశీరామారావుగారు
5 శ్రీ నాగసరపు కృష్ణమూర్తి,
శ్రీ పొట్టిమూర్తి జగన్నాధం అండ్ కంపెనీవారు
6 శ్రీ ఏ. శ్రీనివాసయ్యర్ గారు
7 శ్రీ మండవ వేంకటరెడ్డిశ్రేష్ఠిగారు
8 శ్రీ గొడవర్తి వేంకటసుబ్బారావుగారు
9 శ్రీ పొట్టిమూర్తి సుబ్బారావుగారు
10 శ్రీ రెడ్డి రామసుబ్బయ్యగార్ల సోదరులు

భగవంతుడు వీరి కారోగ్యైశ్వర్యముల నిచ్చి అనవరతము రక్షించుచు వంశాభివృద్ధిఁ జేయుగాక.

శ్రీహయవదనాయనమః

# ప్రస్తావనా

శ్లో॥ శ్రీ షద్వేదతరో ర్జయన్తి జగతా మానన్దపూర ప్రదా
శ్శాఖా స్తత్ర విరాజతే భువి యజుశ్శాఖాఽతి పుణ్యాత్మికా।
తస్యాః ప్రాదురభూన్మహా గుణనిధిః కౌణ్డిన్య నామా ముని
స్తద్ధీరస్య సగోత్రతా మనుగతో లంకాన్వవాయశ్శుభః॥౧

శ్లో॥ తస్మిన్ప్రఖ్యాతయే వంశే దేవీపూజా పరాయణః।
అంబాశాస్త్రీ మహా విద్వా నువాసాత్మాభిధే పురే॥ ౨

శ్లో॥ తస్యపుణ్యవతః పుత్త్రాః పౌత్రాశ్చ వ్యభవన్భువి।
తేష్వేకః పణ్డితశ్శాస్త్ర అంబాశాస్త్ర్య భవద్గురుః॥ ౩

శ్లో॥ శ్రీ మన్త్రిమూర్తే ర్విదుష స్తస్యాస న్పఞ్చపుత్త్రికాః
తేషాం తృతీయ పుత్త్రోఽసా వాసీ దస్మ త్పితామహః॥౪

శ్లో॥ శ్రీవేఙ్కటనృసింహాఖ్య సిద్ధాన్తీ విద్వదగ్రణీః।
తద్ధర్మపత్నీ శ్రీరామలక్ష్మాం బాస్తిగుణాలయః॥ ౫

శ్లో॥ తయో రుదీయు శుక్తే స్సన్మౌక్తికానీవ పణ్డితౌ
పుత్త్రౌ ద్వా వేకపుత్త్రీ చ సౌశీల్య వినయాన్వితాః॥ ౬

శ్లో॥ జ్యేష్ఠ శ్శ్రీ శివరామాఖ్య పణ్డితశ్శాస్త్ర విత్స్వయమ్।
ద్వితీయ స్సుమహావిద్వా న్మృత్యుంజయ సమాహ్వయః॥౭

శ్లో॥ శ్రీ మానస్మ త్పితా పూజ్యః పిచ్చమాంబాన్వితోముదా।
సుతత్రయం కుమార్యౌ ద్వే చాజీజన దుదారధీః॥ ౮

శ్లో॥ అగ్రజో ఽహమపత్యేషు లక్ష్మీనారాయణో ఽపరః।
తతో వేఙ్కటరామాఖ్య ప్రభృతి పాఠరతోగుణీ॥ ౯

శ్లో॥ ఆబాల్యమస్మత్పితురన్తికే వస
న్కావ్యాదికం సర్వ మగృహ్ణ మాదితః।
తతః పితా మయ్యను రక్తమానసో
విద్యామిమాం పాఠయితా బభూవ సః॥ ౧౦

శ్లో॥ గృహస్థధర్మే వినివేశ్య మాం పితా
మోదేన తెన్నాలిపుర స్త్వనీనయత్।
తత్రస్థితః పణ్డితసర్వశేఖర
స్స్నేహేన చాస్మత్పితర మ్ముదా ఽబ్రవీత్॥ ౧౧

శ్లో॥ అత్రాస్తి గీర్వాణ కళాధిశాలా
తత్రైవచాచార్య పదేస్థితో ఽహమ్।
ప్రవేశయే మన్తన యస్త్వదీయ
మధ్యాపయే శక్త్య నురూప మేనమ్॥ ౧౨

శ్లో॥ ఇత్యుదీర్య కృపయా పితర స్త
త్పణ్డితో ఽతి మృదువాక్సుధయా మే।
జీవనో పకృతిదాం శుభవిద్యాం
సన్దదౌ భవశుభావహా మిమామ్॥ ౧౩

శ్లో॥ యో ఽయఙ్గురు ర్మే ప్రథితశ్చ తాతా
సుబ్రాయశాస్త్ర్యుత్తమ శిష్యశిష్యః।
జయంతి వంశో త్తమ పణ్డిత శ్రీ
భగీరథా చార్య ప్రధాన శిష్యః॥ ౧౪

శ్లో॥ కంభంపాటి కులాంబుధే రుదభవ ద్యో య ఙ్కలానాన్నిధి
ర్యో య జ్కీర్తిత రామమూర్తి విబుధో న్వర్థా భిధానో మహా
ఆ భాష్యం సమపాఠయ త్కరుణయా పాతఞ్జల వ్యాకృతౌ
శిష్యా న్వ్యస్తమహ జ్గుణాధికమతిం భక్త్యా నమామ్యన్వహమ్॥

శ్లో॥ తర్క వేదాన్త సారజ్ఞ మపార కరుణా నిధిమ్।
కంభంపాటి కులాబ్ధీందుం రామమూర్తి గురుం భజే॥౧౭

శ్లో॥ న త్త్వైవ స్త్వలిఖ న్మమ మమ పురా పుణ్యై ర్విధి ర్యావతీం
విద్యా స్త్వ జ్గురుబోధనా దహమపి ప్రాప్తోఽస్మి సూక్ష్మామిమాం
త ద్విద్యావశతో ఽహ మత్ర నగరే విద్యాలయే సుప్రథా
నాన్ధ్రా ధ్యాపక శోభి తార్య పదవీ మాశ్రిత్య జాగ ర్మ్యహమ్॥

శ్లో॥ అత్ర స్థితా చార్య వరేషు కశ్చి
త్ప్రకృష్టధీ శ్చాంగ్లవిదాం వరేణ్యః।
వేదాన్త వి త్త్యాగ గురో శ్చ శిష్య
స్తే నాత్మన స్సఖ్య మభూ త్ప్రభూతమ్॥ ౧౮

శ్లో॥ సో య మాచార్య వర్య శ్చ ప్రతివత్సర మాత్మనః।
గురో శ్శ్రీత్యాగరాజస్య వార్షికోత్సవ కర్మ కృత్ ౧౯

శ్లో॥ ఏవ ఙ్కుర్వ న్నుత్సవాం స యాపయిత్వా ద్వి వింశతిమ్।
కా శ్చి దాహ్వానవార్తా స్తాం దృష్ట్వా తుష్టి మవాప సః॥

గద్య॥ కిన్తద్? ఇతివక్ష్యే- అద్యతనలోకేరాగ శాస్త్రే కృత
పరిశ్రమా; శ్రీ త్యాగరాజ పాదసేవాధురన్ధరా
భక్తిమతీ బెంగుళూరు పురవాసినీ శ్రీమతీ నాగరత్న
మనామ్నీ కాచన ప్రభూతయ శస్వినీతి భువిప్రథితా.

సాతు స్వార్జిత విద్యోపార్జిత ధనేన శ్రీ మత్త్యాగరాజ
గురోరాజ్ఞానుసారేణ * వత్సరాణాం షష్టేర
నన్తరం తిరువాయూరునామకే పఞ్చనదేశ్వరక్షేత్రే
కావేరీతీరభూషా వాత్మగురురూప శ్రీ త్యాగరాజ
విద్వన్మణే స్సమాధి స్థలే నిత్య నైవేద్య దీపారాధనాది
పూజాఙ్కారయన్తీ శ్రీ వ్యయనామ సంవత్సర పుష్య
బహుళ పఞ్చమీ ప్రభృతి శ్రీ స్వామినాం శతవర్షి
కోత్సవ ఞ్చికీర్షన్తీ తద్భక్త బృన్దాహ్వానార్థం వార్తా
పత్రికాయా ముత్సవోదన్తం ప్రకటీచకార, ౨౧

శ్లో॥ సోఽయం సఖా మే పరిశీల్య వార్తాం
స్వాన్తే నివేశ్యాత్మ సతీ మవాదీత్।
సా ధర్మపత్నీ పతిమేవ మాహ
చావాఙ్కరిష్యావ ఇతి ప్రమోదాత్॥ ౨౨

శ్లో॥ తద్వాక్య మాకర్ణ్య స తుష్టి మాప్య
యత్నఞ్చకారాత్మ బలానురూపమ్।
తథాపి నాసీద్బహు విఘ్నపూర్ణః
శ్రేయాంసి విఘ్నై ర్బహుధా యుతాని॥ ౨౩

గద్య॥ తతస్స చాచార్యవర్యః పాఠశాలాయా విగన్తుముద్యుక్తః
ప్రథమతః పరిమిత విరామ మాదాయ భోః! శాస్త్రిన్!
ఇతి మా మాహూయ నమస్కృత్యేద మబ్రవీత్॥ ౨౪

---

★ చూ: ౫ వ సర్గలో ౭౭ వ శ్లో॥

శ్లో॥ అహం శ్రీ త్యాగరాజస్య శతవార్షిక సంష్ఠితమ్।
ఉత్సవ మ్పరిచికీర్షామి పక్షత్రయ మి హాఽవధిః॥ ౨౫

శ్లో॥ ఇత్యాభాష్య త దర్థ న్త్వా మ్ప్రార్థయే త ద్గురోః కథామ్
శ్రుతేః పీయూష రూపాం తాం కృత్వా మమ కరేఽర్పయ॥

శ్లో॥ తత స్తత్కుల గోత్రాదీ న్పృష్ట్వా కర్తుం సముద్యతః
తస్మా దాదౌ యశో వృద్ధ్యైవంశం తం విప్రబో మథ॥

## కృతిదాపయిత్రృ వంశవర్ణనమ్.

శ్లో॥ విదేహ భూపస్య మహాగురు ర్యో
విభావసో ర్యః శ్రుతి మగ్రహీ ద్వై।
అద్వైత సిద్ధాయత శుక్లవేద
మద్యైష్ట యో ఽసౌ భువి యాజ్ఞవల్క్యః ॥౨౮

శ్లో॥ భారద్వాజ సగోత్రా స్తే కవికొండల వంశజాః
తేషా ఙ్కశ్చి త్పండితా గ్ర్యో బ్రహ్మయా భిధ దీక్షితః॥

శ్లో॥ త స్యాన్వవాయే ఽప్యుదితా నరా యే
చాసప్తమం మోక్ష మవాప్నుయు స్తే
'త ద్వాక్య మన్వర్థయితుం విరిఞ్చి
స్ససర్జ హీ త్యర్థవ దాఖ్యయా స్థితః॥ ౩౦

శ్లో॥ గృహస్థ ధర్మా న్సకలా న్సమాప్య
పుత్త్రైః పితౄణాం పరిహాప్య శాన్తః।

యజ్ఞైన దేవా నపి ప్రీణయ న్స
చాన్తే తురీయాశ్రమ మావివేశ॥ ౩౧

శ్లో॥ త స్యాత్మజో వేఙ్కటరత్న నామా
గుణాకర శ్శాస్త్రవి దుత్తమోత్తమః।
తస్యాత్మజే ష్వాంగ్లవిదాం వరో ఽసౌ
నృసింహ నామా స్త్వ్య తుల ప్రభావః ॥ ౩౨

శ్లో॥ యో ఽసౌ నృసింహః ప్రథితప్రభావో
విద్యాలయో దత్తవి చారకారీ।
త స్యాత్మపత్నీ నిరతాన్నదాత్రీ
శ్రీకృష్ణవే ణ్యప్రతిమప్రథా సా॥ ౩౩

శ్లో॥ శ్రీ నృసింహబుధా త్కృష్ణవేణ్యంబా సుషువేసుతమ్।
కవికొండల వంశాబ్ధౌ రత్నవ త్పురుషోత్తమమ్॥ ౩౪

శ్లో॥ స చాపి పూర్వార్జిత పుణ్యజాలై
ర్బ్రహ్మీ భవిష్ణుః పురుషోత్తమాభిధః।
శ్రీ రాజ్యలక్ష్మ్యాఖ్యకయా గృహీ య
స్సోఽయం నరే షూత్తమ ఏవ సత్యమ్॥ ౩౫

శ్లో॥ దానే గుణే భోగ సుఖే ఽను రాగే
వైరాగ్య మార్గే ఽపి సుసజ్జతో యః।
ఆత్మీయ వృత్తౌ నిపుణో ఽతిభక్తి మాజ్ఞా
విద్యా ప్రబోధే పురుఽషో త్తమోభూత్॥ ౩౬

శ్లో॥ తదీయ సేవా నిపుణాత్మధర్మైః
సమ్మోదయన్తీ పతి మన్వహం సా।

శ్రీర్నామ మోక్ష స్త దిదం స్వరాజ్యం
త ద్రాజ్యలక్ష్మీత్యభి ధాఽతిపూతా॥ ౩౭

శ్లో॥ నిజం పతిం శ్రీ పురుషోత్తమాహ్వయం
దైవన్నిజం శ్రీపురుషోత్తమేశ్వరం।
నిజా న్తసుం శ్రీపురుషోత్తమాత్మికం
వితన్వతీ సా హ్యతిరాజ్యలక్ష్మ్యభూత్॥ ౩౮

శ్లో॥ యదా పాణి గృహీతీ సా సంపన్న శ్రీ రభూ త్తదా।
మోక్ష సామ్రాజ్య లక్ష్మీ చ కరస్థా ఽస్య సతీ సుఖాత్॥

శ్లో॥ ఏవ మ్మమ సుమిత్రస్య మనోరథ సుపూర్తయే।
మాస మేక మహం సర్వం గ్రన్థం వ్యరచయ న్త్విమమ్।

శ్లో॥ అనన్తరం శ్రీ పురుషోత్తమాఖ్యో
ప్యాహూయ విద్వ త్కవిగాయకాంశ్చ।
శ్రీ త్యాగరాజాయ సభా న్తరాళే
కృతి మ్మయా ఽదాపయ దర్హ వృత్త్యై॥ ౪౧

శ్లో॥ పారుపల్ల్యన్వయాబ్ధీన్దూ రామకృష్ణయ్య నామకః।
కాశీ కృష్ణకవీశ శ్చ సభాధ్యక్షౌ బభూవతుః॥ ౪౨

శ్లో॥ శ్రీ మ న్మహారాజ పదాఙ్కితస్య
శ్రీ రామచన్ద్రస్య పురః ప్రదేశే।
అధ్యక్షరూపౌ సువిశ్రుతౌ ద్వౌ
సభా ముద ఞ్చక్రతు రర్హవాక్యైః॥ ౪౩

శ్లో॥ అనన్తరం సంసది మామకీనా
మాశ్రావయ న్సత్కృతి మార్య కీర్త్యామ్।

తత శ్చత చ్ఛ్రీ పురుషోత్తమాఖ్య
శ్చకార మే సంసది స త్సపర్యామ్॥ ౪౪

శ్లో॥ కాశీ కృష్ణకవీశ్వరేణ విదుషా శ్రీరామకృష్ణేన మే
దాశీర్వాదన పూర్వక శ్చ వలయం హైరణ్యమత్యుత్తమం
ఘణ్టాకఙ్కణ మాదరా ద్బహుమతి శ్చాదాపయ ద్గౌరవం
కృత్వాశ్రీపురుషోత్తమస్తుగురవేచేమాంకృతింప్రార్పయత్॥

ఇతిప్రస్తావనా సమాప్తా

ఓమ్ తత్సత్



శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీత్యాగరాజ చరితామృతే

## ప్రథమస్సర్గః

---

శ్లో॥ శ్రీచంద్రరామ పదారవింద మకరన్దాస్వాద షట్పదాయ
భారద్వాజ మునేస్సగోత్ర జననాత్పూతాయ శాన్తాత్మనే
కాకర్లాన్వయ దుగ్ధవార్ధి శశినే శ్రీత్యాగరాజాయ స
ద్భక్తాగ్రేసర శేఖరాయ విదుషే నిత్యంనమస్కుర్మహే॥ ౧

తా॥ భారద్వాజ గోత్రసంభవుఁడై కాకర్లకులమున జనన
మొంది శమదమాదిగుణములచే నొప్పారుచు శ్రీరామ
చంద్ర పాదారవింద మకరంద పానతుందిలుఁడై భక్త
వర్యుఁడగు శ్రీ త్యాగరాజ స్వామివారికి నమస్క
రించెదము.

శ్లో॥ శ్రీమద్ధయానన పదామ్బుజ మర్చయిత్వా
స్మృత్వాత్మదేశిక పదే హృదయాంబుజేఽహమ్।
శ్రీత్యాగరాట్చరిత మద్భుతమాతనిష్యే
మత్యాల్పయా సుగుణజాత విరాజితాంశమ్॥ ౨

తా॥ శ్రీమద్ధయగ్రీవుని పదకమలములఁ బూజించి నిజగురు
పదము లెదఁదలఁచి నా స్వల్పబుద్ధితో సుగుణగణ
భూయిష్టంబును, అత్యపూర్వంబగు శ్రీ త్యాగరాజ
చరిత్రను విరచింపగలను.

శ్లో॥ సుధాప్రవాహేఽత్యన్త మధుప్రపూరే
వాస్మింయచ్చరిత్రేఽల్ప వచోమదీయమ్।
లసత్యాఽతి యత్నే మధుయోగసిద్ధ్యై
రుచ్యస్తదం స్వీక్రియతే తథైవమ్॥ ౩

తా॥ అతిమధురము సానందమునగు నీ త్యాగరాజ చరిత్ర యందు నా వాక్యములు 'మధురపదార్థమును భుజించు నప్పుడు వెగటుపుట్టి దానిపై రుచిగల్గుట కన్నరస నిషేవణముట్లు' రసాంతరోపమములైయుపకరించును.

శ్లో॥ శ్రీ త్యాగరాజోత్తమ నేతృయుక్తం
గీర్వాణ వాణీపదవాక్యబోధమ్।
సద్గ్రన్థితే సచ్చరితమ్మయేహ
తేనాతి ధన్యోఽహమితి ప్రమోదే॥ ౪

తా॥ త్యాగరాజను ఉత్తమనాయకుడును, సంస్కృత పదములును నావ్రాయు గ్రంథమున కాధారములగుటచే నేను ధన్యుడనగుటయేగాక నా చరిత్రకు గొప్పదనము రాగలదు.

శ్లో- శశశృఙ్గ ఖరీవిషాణవ
త్ప్రథితం క్షుద్ర నరేషు వర్ణనమ్।
తదుదీర్ణ మహామహిమ్నాం
గిర ఏతత్కరణాత్పునామ్యహమ్॥ ౫

తా॥ అల్ప మనుజవర్ణనము కుందేటికొమ్ములవలె నత్యంత శూన్యమైనదైనను గొప్పగ నిదివరకు నాచేవర్ణింపబడినది, అట్టి యనృతవర్ణనముచే పంకిలమగు నా వాక్కు దీనఁబవిత్రముఁ జేసికొందును.

శ్లో॥ లోకస్థితేషూత్తమ వస్తుమాత్రా
విద్యాప్రశస్తి గ్రమితోఽథసాపునః
ఆసీచ్చతుష్షష్టి కళాభిరన్వితా
తాసామియజ్ఞానకళాఽతిమాధురీ॥ ౭

తా॥ లోకమందున్న వస్తుసముదాయమున విద్యయును న
దత్యుత్తమమైనది; అదియఱువదినాల్గుకళలుగనేర్పడియుండు
నందలి రమణీయమైన దీగానకళ.

శ్లో॥ యస్మాత్త్రివేదీ నతు గాయకోఽపి
యోగాయక స్తస్య న శాస్త్రవిత్త్వమ్
ఇత్యజ్ఞవాదం విఫలం చికీర్షు
స్సస్సర్జధాత్రాఽద్వయ సిద్ధమేనమ్ ౮

తా॥ తర్కవ్యాకరణాదిశాస్త్రవేత్తలకు గానకళయుండదు.
గాయకులు సాధారణముగ శాస్త్రవేత్తలుగనుండరు,
అను అజ్ఞజనవాక్యమును విఫలమొనరింప నైక్యతకై
యీత్యాగరాజు నీశుఁడు సృజించె॥

శ్లో॥ సత్యే విరిఞ్చేర్భువి చాయమద్య
ధన్యావిమౌద్వౌ ఫలభోగభాజౌ
ఏకో భవత్వా దపరస్తుతత్వా
ద్వాణ్యాత్మ వక్షోజఫలోపభోగౌ॥ ౯

తా॥ సంగీత సాహిత్యరూపములగు సరస్వతీదేవియొక్క
వక్షోజఫల భాజను లిరువురు. అందు మగడై సత్యలో
కమున బ్రహ్మయు, భూలోకమునఁ బుత్త్రుడై శ్రీ
త్యాగరాజును తత్ఫలానుభూతిచేధన్యులు.

శ్లో॥ శ్రీరామనామామృత పూతమాసీ
చ్ఛ్రీత్యాగరాజస్య చరిత్రమేతత్

తాదృక్షనావర్తన తత్పరేయం
దేవీసుతాం గీర్మమ సుప్రశస్తా॥ ౯

తా॥ స్వభావపవిత్రుడగు శ్రీ త్యాగరాజు రామనామ జప
ముచే నతిపవిత్రుడై నా చరిత్రకు నాధారమగుటచే
నావాక్కీ లోకమునఁ బ్రసిద్ధినందగలదు.

శ్లో॥ వల్మీకప్రభవం పరాశరమునిం వ్యాసం శుకం జైమినిం
భట్టాహ్వం గురు మక్షపాదకణభు గ్వాణిన్యహీన్ద్రాదికాన్
నత్వాఽహం ప్రణమామి కాళిదాస మనిశం భాసఞ్చ బాణన్తథా
స్మృత్వా సత్కవిశేఖరోక్తవిధయా వక్ష్యే ముదా సాంప్రతమ్॥

తా॥ ఆదికవియగు వాల్మీకిని, పరాశరుని, వ్యాసుని, జైమి
నిని, భట్టపాదుని, గురువను శాస్త్రకారుని, గౌతముని,
పాణిని, పతంజలి మొదలగు నాదిపండితులకును,
కాళిదాసాదిపూర్వకవులకును నమస్కరించి సత్కవీశో
క్తమగు భంగినేనీ కథను కావ్యరూపముగ వ్రాయగలను.

శ్లో॥ లోకే కాకకులోపమాః కుకవయస్సత్కావ్యజాతేఽపి య
ద్దోషోద్ఘాటన మేవ కుర్వత ఇతి స్వాభావికీ తన్మతిః
పీయూషోపమితస్వభావమధురై ర్యుక్తేఽపి చూతే ఫలైః
ధ్వాంక్షా నింబఫలాని భుంజత ఇతి ప్రారబ్ధదోషో మహాన్॥

తా॥ కాకులఁబోలిన కుకవులు సత్కావ్యము లందలి దోషము
లెంచుటయె గాని గుణముల గ్రహింపలేరుగదా? మధు
రఫలయుతములగు మామిళ్ళుండగా కాకులు వేపపండ్ల
ను దినును. అదివాని ప్రారబ్ధముగదా?

శ్లో॥ అభావినన్దస్తు గుణప్రలబ్ధాః
విద్వస్తు మూఢాః కుధియోఽల్పధీకాః

పర త్విదం రమ్య మి తీరయన్తి
తేషా మ్ముదే యత్న మిమ ఙ్కరిష్యే॥ ౧౨

తా॥ గుణగ్రహణసమర్థులగు పండితులు సంతసింతురుగాక; కుబుద్ధులగు నల్పులు నిందింతురుగాక. నా యీకావ్యము నెవరు మంచి దనగలరో వారికొఱకే నేనీయత్న మొనరించెదను.

శ్లో॥ త్యాగరాజ చరిత త్వతిపూతం
భావ రాగ లయ తాల సమేతమ్।
తస్య కథానుకథనం రచయిష్యే
భక్తి భావ సముపేత మపూర్వమ్॥ ౧౩

తా॥ అతిపవిత్రమగు శ్రీ త్యాగరాజచరిత్ర లోకమున సంగీతశాస్త్రముచే గణనకెక్కినది. అట్టి భక్త్యాత్మకమగు కథను నూతనముగ నేవ్రాయఁగలను.

శ్లో॥ ఆద్యే సర్గే తస్య జన్మాదిచేష్టాః
ద్వితీయాకే తస్య విద్యా ప్రశస్తిమ్।
గ్రంథావాప్తిం రామమంత్రస్య యోగం
తార్తీయాకే శిష్య విద్యార్పణంచ॥ ౧౪

తా॥ పంచసర్గాత్మకమగునీకావ్యమున ప్రథమసర్గలో త్యాగరాజ జననాదికమును, రెండవదానియందాతని పాండిత్యప్రశంసయు. మూడవసర్గయందు శ్రీరామమంత్రోపదేశమును, గ్రంథలబ్ధియు, శిష్యప్రవచనమును చెప్పగలను.

శ్లో॥ సర్గే చతుర్థే పరదేశ యాత్రాం
శ్రీరామ దేవాప్తి మథ ప్రవృత్తిమ్

ఆస్త్యే సుతాప్తిం స్వసతీ వియోగం
యత్యాశ్రమావాప్తి మథ ప్రవక్ష్యే॥ ౧౫

తా॥ నాల్గవసర్గమందు త్యాగరాజపరదేశగమనము, నిజదైవమగు శ్రీరామ విగ్రహాదుల పొందుటయు, భక్తియును, ఐదవసర్గయందు పుత్రికాయోగమును, భార్యావియోగమును, సన్యాసయోగమును జెప్పెదను.

శ్లో॥ పుణ్యాలయే భారతదేశమధ్యే
క్షేత్రైః పవిత్రై ర్భువి భాసమానా।
దిగ్దక్షిణా తత్ర సు తాఽతిపూతా
విరాజతే తజ్జపురీ తి కాచిత్॥ ౧౬

తా॥ పవిత్రవంతమగుభారతదేశమునపుణ్యక్షేత్రములుగలది దక్షిణదిక్కు. అట పట్టణ రాజమగు తంజపురమను నదొక్కటి గలదు.

శ్లో॥ గుణాకరో రామ పదాబ్జ భృఙ్గ
స్సఙ్గీత సఙ్గీ 'తులసింగు' నామా।
ప్రభు ర్దయాళు ర్జనశోకహారీ
కలానిధి స్తన్నగరీం రరక్ష॥ ౧౭

తా॥ సర్వసుగుణోపేతుఁడును, శ్రీరామసేవాధురంధరుఁడును, సంగీతశాస్త్రలాలసుఁడునగుతులసింగుయను పేరిటదయామయుఁడగు రాజాతంజపురమును పాలించుచుండెను.

శ్లో॥ తఞ్జాపురసమీపేఽస్తి
"తిరువయ్యారు" పత్తనమ్।
తత్రావాస మ్కరోతిస్మ
'గిరిరాజ' కవీశ్వరః॥ ౧౮

తా॥ తంజాపురమునకుసమీపమున తిరువళ్ళూరను పట్టణము గలదు. అంట గిరిరాజను పండితకవియొకడుండెను.

శ్లో॥ స రాజ పంభావితకోవిదాగ్రణీ
ర్వేదేషు శాస్త్రేషు చ పార గోఽభవత్।
జప న్ముదా రామషడక్షరీం సదా
పాత్రివ ర్తయ ద్వృత్తి మనిన్ద్యకర్మణా॥ ౧౯

తా॥ వేద వేదాంగ పారగుండగునా గిరిరాజకవి రాజసమ్మానమునుబొందినవాడై రామషడక్షరమంత్రమునుజపము నచ్చుకొనుచు ననింద్యమగువృత్తితో జీవించుచుండెను.

శ్లో॥ త స్యాఽభవ న్పఞ్చ సుతా విశారదా
గుణాకరా రామజపానుమోదకాః।
తేషాం మతిశ్రేష్ఠతమో బుధాగ్రణీ
స్స రామపూర్వః ఖలు బ్రహ్మ యాభిధః॥ ౨౦

తా॥ ఆ గిరిరాజపండితున కేవురు సుగుణవంతులగు పుత్త్రులు గలరు. వారలలో నత్యుత్తముడునుపండితుడునగు రామబ్రహ్మమను కొమరుడొక్కడుండెను.

శ్లో॥ యదృచ్ఛాలాభతు ష్టోఽసౌ
రామనామ జపన్ సదా
బ్రహ్మానన్ద మవాపే తి
'రామబ్రహ్మే' తి కీర్తితః॥ ౨౧

తా॥ ప్రాప్తలాభముతోసంతోషించుచు శ్రీరామజపతత్పరుడై బ్రహ్మానందమును బొందియుండుటచే నాతనిని రామబ్రహ్మమనిరి.

శ్లో॥ తస్యాస్య రామా సకలాభిరామా
శాన్తాతికాన్తా సుగుణైరనన్తా।
సీతాభిధానా నిరతాన్నదానా
పతివ్రతాస్త్రీ నివహప్రధానా॥ ౧౨

తా॥ ఆ రామబ్రహ్మముగారిభార్య సర్వలోకాభిరామయై శాంతస్వభావమునను, అన్నదానమునను ప్రసిద్ధికెక్కినదై సీతయను పేరుతో పతివ్రతల కొజ్జబంతియైయుండెను.

శ్లో॥ జాయాపతీ తౌ అతిపూతభూతౌ
నిత్యం హరిధ్యానపరౌ మహాన్తౌ
కాకర్ల వంశోద్ధరణాయ జాతౌ
పుణ్యౌ భరద్వాజసగోత్ర వన్తౌ॥ ౧౩

తా॥ అతిపుణ్యవంతులగు నాదంపతులిద్దరును శ్రీరామనామ మేమఱక జపించుచు పవిత్రమగు భారద్వాజగోత్రమున కాకర్లవంశోద్ధారకులై వెలసిరి.

శ్లో॥ తౌ దమ్పతీ సానుజ మారుతైతం
సీతా సమేతం రఘురామ విగ్రహమ్।
సంపూజ్య భక్త్యా నిజకార్యసాధకా
వుఞ్ఛప్రవృత్త్యా దధతు స్స్వజీవనమ్॥ ౧౪

తా॥ ఆదంపతు లిరువురును శ్రీరామపంచాయతన మింట భక్తితో గొలుచుచును ఉంఛవృత్తిచే గాలయాపన మొనరించుచుండిరి.

శ్లో॥ ఏవంస్థితే తఞ్జపురాధినేతా
సన్తానహీన స్తులసింగు నామా

అహ్వాయయామాస బుధా న్వినీత్యా
పప్రచ్ఛ తా న్సన్తతి మాత్మనీనామ్॥ ౨౫

తా॥ ఇట్లుండ నాతంజాపురరాజు సంతానహీనుండై తనకొలువునగలపండితులరావించిస్వీయసంతానఫలమునడిగెను.

శ్లో॥ ఊచు శ్చ కేచి ద్గ్రహ శా న్తివాక్యైః
కేచి త్త మాచఖ్యురథాభిచారైః
అ న్యేఽపద న్నిష్టిభి రన్యభూసురాః
ప్రోచు శ్శుభాం పఞ్చనదేశసేవామ్॥ ౨౬

తా॥ కొందఱుపండితులు గ్రహశాన్తినలనను, గొంద ఱాభిచారిక హోమములచేతను, గొందఱుపెద్దలు బుత్త్రకామేష్ట్యాదులచే, మఱికొంద ఱాపత్తనసమీపమందలి తిరువయ్యారునగల పంచనదేశ్వరునిసేవవలన నారాజునకు సంతానఫలము గలదనిచెప్పిరి.

శ్లో॥ తత స్స రాజా తులసింగునాథో
ద్వితీయషా జీ త్యభిధాఽతిపూతః।
స్వరాజధానీం సమయాఽతిశోభం
జగామ తత్పఞ్చనదేశదేశమ్ ॥ ౨౭

తా॥ పిమ్మట 'రెండవషాజీ'యని చరిత్రప్రసిద్ధిగల యా తులసింగురాజు తన పత్తనసమీపమునగల పంచనదేశ్వరక్షేత్రమునకు కుటుంబయుక్తముగఁజనుదెంచెను.

శ్లో॥ తత్ర స్థితై స్స్వీయబుధై స్సుసంయుత
శ్శివం సిషేవే సుతకాఙ్క్షయా విభుః
సేవాతితుష్టః పరమేశ్వ రోఽస్య త
త్స్వప్నేఽ వద త్త ద్కరుణార్ద్రమానసః॥

తా॥ ఆ పంచనదక్షేత్రమున స్వ్యాస్థాన విద్వాంసులతోఁ బత్నీ సమేతముగనారాజీశు నారాధించెను. అంతశంకరుఁడు ప్రీతినొంది దయతో నా రాజునకు స్వప్నదర్శన మిచ్చి యిట్లనెను.

శ్లో॥ అయి! తేఽ స్తు సుతస్సుబుద్ధిమా
న్మమ సేవా నిపుణో ఽతిభక్తిమాన్।
త దిదం శ్రుణు! మద్వచః "పురా
మఘవా దైత్యబలాభిమర్దితః॥ ౨౯

తా॥ ఓయీ! నీకు త్వరలో సంతతికలుగగలదు. ఆతడు నా భక్తుడు కాగలఁడు. దానికొక యితివృత్తముగలదు; వినుము, "పూర్వము దేవేంద్రుఁడొకప్పుడు రాక్షసులచేఁబీడింపఁబడుచుండెను,

శ్లో॥ ప్రణమ్య నారాయణ పాదపద్మే
దైత్యాపరాధా న్నిఖిలా న్నివేద్య।
తస్థౌ తురాషా డథ మాధవ స్తం
ప్రోవాచ జిష్ణో! తదిదం శ్రుణు త్వమ్॥ ౩౦

తా॥ ఆ యింద్రుఁడు శ్రీమన్నారాయణుని సందర్శించి రాక్షసుల యాగడముల నెల్లఁదెలుపుకొని యంజలిబద్ధుఁడై నిలుచుండెను. అంత నావిష్ణు వాయింద్రునిగూర్చియిట్లనుచు వినుమనెను.

శ్లో॥ త్యాగరాజ ఇతి సంజ్ఞయా స్థితో
మత్కలామయ ఇతి ప్రబుద్ధధీః।
తత్పదే సమనుసేవతా మ్భవా
నాసురం త్యజ భయం సురాధిప॥ ౩౧

తా॥ త్యాగరాజనుపేరిట నా యంశామూర్తుడొకడు గలడు. అతనిని నీవుసేవించి రాక్షసభయమును తొలగుము.

శ్లో॥ ఇ తీరయిత్వా ప్రదదౌ మురారి
ర్మూర్తి స్తదీయా మరి భేదనార్థమ్।
మదీయపూజాముదిత స్స విష్ణు
ర్దదా వితీన్ద్రో ముద మాప బాఢమ్॥ ౩౨

తా॥ ఇట్లావిష్ణువు తనయంశమగు నాత్యాగరాజమూర్తి నింద్రునకు శత్రుజయమునకై యొసగెను. 'నాపూజకు విష్ణువు సంతసించి యొసగె' ననియింద్రుఁ డానందము నొందెను.

శ్లో॥ తదీయ సేవాం విరచయ్య వజ్రీ
దైత్యా న్వినిర్జిత్య యశః ప్రపేదే
తదా స మోహా దవలేపయోగా
దజం విసస్మార మురారిదిష్టమ్॥ ౩౩

తా॥ అంత నింద్రుఁడా దేవుని సేవించి రాక్షసులను జయించి కీర్తిని బొందెను. ఇంతట నాగర్వమునస్మృతితప్పి యా త్యాగరాజు సంగతిని మరచెను.

శ్లో॥ ఏవం స్థితే దేవవిభు స్స దర్పతో
విస్మృత్య తత్కృష్ణకరార్పితం విభుమ్।
శ్రీత్యాగరాజాహ్వయ మన్యలాలస
స్త్రివిష్టపం ప్రాప్య సుఖీ బభూవ॥ ౩౪

తా॥ ఇట్లింద్రుఁడు విష్ణుదత్తమగు విగ్రహమును బూజింపక నన్యలాసుఁడై యింద్రరాజ్యమున సుఖముగనుండెను.

శ్లో॥ ముచుకున్ద ఇ తీరితః ప్రభుః
సచివైస్సార్థ మథాఽరి నిర్జితః।
శరణం ప్రయయౌ సురాధిపం
వినయే నాఖిల మూహ తంవిభుమ్॥ ౩౫

తా॥ అంతట ముచుకుందుఁడను రాజకప్పుడు శత్రువులచేఁ బరాభూతుఁడై యింద్రుని శరణుజొచ్చి వినయముగఁ దనసంగతిని దెల్పుకొనియెను.

శ్లో॥ తద్వాక్య జాలం స విచిన్త్య జిష్ణుః
పురాఽఽత్మనే కృష్ణకరేణ దత్తమ్।
శ్రీత్యాగరాజాభిధ మమ్బుజాక్షం
ప్రాయచ్ఛ దస్మై ముచుకుందనామ్నే॥ ౩౬

తా॥ ఆతనివాక్యములనింద్రుడువిని పూర్వము విష్ణుమూర్తిచే సేయఁబడినశ్రీత్యాగరాజమూర్తినాముచుకుందున కొసగెను.

శ్లో॥ తదీయసేవాం విరచయ్య సోఽగమ
జ్జయం మురారీ న్వివిహత్య సంయుగే।
తతః పరం స్వార్తిహరం సువిగ్రహం
సంస్థాప్య చైకత్ర భజ న్దివం యయౌ॥ ౩౭

తా॥ ముచుకుందుడా విగ్రహమును సేవించి శత్రుజయమొంది తదాది నాదేవునారాధించుచు నంత్యకాలమున నొక్కచో నాదేవునిస్థాపించిస్వర్గమును జేరెను.

శ్లో॥ తత్స్థానం 'తిరువయ్యారు'
సంజ్ఞయా వర్తతే భువి।

తత్తు పఞ్చనదేశాఖ్యం
స్థాన ఇత్యేతి విదుర్బుధాః॥ ౩౮

తా॥ ఆస్థలమునే 'తిరువయ్యా'రను పేరుతోఁ బిలుచుచుందురు, మఱియు దానినే పంచనదేశ్వరమనియు ననుచుందురు,

శ్లో॥ "జహౌ వయ స్త్వేవ" మితి ప్రకోపా
త్స్వభూ శ్శశా పేన్ద్రి నరో భవేతి,
తే నాద్య వజ్రీ భవితా సుత స్తే"
త్యేతీరయిత్వా స్త్వరధా త్స శమ్భుః॥ ౩౯

తా॥ 'ఈతడు నాచేనొసఁగఁబడిన మూర్తిని త్యజించె' నని యా విష్ణువు పుడమునిబుట్టునట్లతనికి శాపమొసంగెను, ఆకారణముగా నింద్రుడిప్పుడు నీకుఁబుత్త్రుఁడై పుట్టు" నని చెప్పి యా శివుడంతర్థానమొందెను,

శ్లో॥ స స్వాప్నికం ప్రాత రనూద్య సర్వం
బుధా న్సమాహూయ నివేద్య తస్థౌ।
తే శాస్త్రజాల మ్పరిశీల్య ప్రోచు
స్స్వప్న ఏషో తిఫలప్రద స్స్యాత్॥ ౪౦

తా॥ అంతట రాజుమేల్కని యావృత్తాంతమును సభలోఁ బండిత సమక్షమున దెలియబరచెను; వారును శాస్త్రములఁ బరిశీలించి 'ఇయ్యది సత్ఫలమునొసగు స్వప్న' మని పల్కిరి.

శ్లో॥ శ్రీరామబాణ శ్శివనేత్రపావకో
మహాత్మనాం శాప ఉషస్సముద్భవః।

స్వప్నః ప్రశాన్తస్య పరాక్రమక్రమో
దిశ స్త్యమోఘ మ్ఫల మేవ నాన్యథా॥ ౪౧

తా॥ శ్రీరాముని బాణమును, శివునికంటిమంటయు, మహాత్ముల శాపమును, తెల్లవారుజామున గలిగిన స్వప్నమును, శాంతుని కోపమును వ్యర్థమెన్నటికిని కాదు.

శ్లో॥ తస్మా ద్విభో! విష్ణువచోఽనుసారత
శ్శ్రోఽద్య పుత్త్రి స్తవ సఞ్జనిష్యతే,
మాగా విషాద ఙ్కురు తత్పదార్చన
ఞ్చాత్ర మ్పురారేః పదవఙ్క్.జేఽర్పయ॥ ౪౨

తా॥ అందుచే నో రాజా! ఆభగవద్వచనానుసారముగ నీకుం బుత్త్రుడుదయించును. చింతపలదు; ఆపంచనదేశ పాదార్చనము గావించు చుండుము” అనివారురాజుతో ననిరి.

శ్లో॥ ఇత్థం స్వప్నఫలం విబుధ్య విబుధై స్సన్తోషయుక్తః ప్రభు
స్సత్కార ఙ్కృతవా న్యథార్హ మథ తా నస్మై రనస్మై స్తదా
తే తుష్టా శ్శత మాశిష స్త్వథ దదు ష్షాజీతి నామ్నే తత
స్స్వస్థాన న్నరపాలకశ్చ విబుధా జగ్ముః పరవ్నిర్వృతాః॥ ౪౩

తా॥ ఇట్లారాజు స్వప్నఫలమునువిని సంతసమున నా పండితుల గౌరవించి యాశీస్సులంబొంది యావాసమున కేగెను; పండితులునుదమగృహములకుఁ జనిరి.

శ్లో॥ ఋత్వా చరిత్ర స్త్వధిపస్య రామ
బ్రహ్మాభిధస్యా భవ దుత్సుకం హృత్,
స ప్రాప్త మోదః పరత త్త్వ బోధ
ఙ్కార్వన్నుపాయావస దన్తికే తు॥ ౪౪

తా॥ కాకర్ల రామబ్రహ్మ పండితుఁడును తంజపుర మహా రాజ వృత్తాంతమును విని యానందించి యారాజ వరుని జేరి పరతత్త్వబోధ నొనరించు చుండెను.

శ్లో॥ రామబ్రహ్మ బుధాగ్రణీర్ద్విజ సుతౌవిద్యావిహీనావితి స్వాత్మన్యేవవిచిన్త్య యత్రపితిరస్స్వవాసమాకల్పయన్ తత్స్వమ్పరిహాయ పఞ్చనద మధ్యావాసయోగ్యన్త్వితి ప్రస్థాయప్రదదౌ స్వగేహమఖిల జ్ఞ్యాస్మైచిదార్యాయసః॥

తా॥ రామబ్రహ్మముగారును "తనకున్న పుత్త్రులిర్వురు విద్యావిహీనులగుచుండిరి; జీవనము గడచుట దుస్తర మనుకొని తండ్రితాతలనాట నుండిన గృహమునొక బ్రాహ్మణునకు దానమొనరించి తిరువయ్యారునుండి వచ్చి పంచనదక్షేత్రమూవాసముగఁ జేసికొనిరెను.

శ్లో॥ రామబ్రహ్మౌకరోద్వాసం
తిరువయ్యారు పత్తనే।
పుత్త్రౌ వధ్యాపయం చ్ఛాస్త్రం
రాజగౌరవ తోషితః॥ ४६

తా॥ ఇట్లారామబ్రహ్మముగారు తిరువయ్యారు జేరి పుత్త్రు లకు శాస్త్రములఁ జెప్పుకొనుచు రాజగౌరవమున కాలక్షేప మొనరించుచుండె,

శ్లో॥ తౌ దంపతీ సర్వజనానుమోదనం
సమ్పాద్యతాజానుమతౌ బభూవతుః।
నిత్యం రమాకాన్త పదామ్బుజే శుభే
చిత్తం సమాసాద్య జిజీవతుశ్చతౌ॥ ४८

తా॥ ఆరామబ్రహ్మముగారునాయనధర్మపత్ని సీతమ్మయు సర్వజన సమ్మతులయి యాగ్రామమున నివసించుచు శ్రీరామపంచాయతన సేవ నింటికడఁ జేయుచు చిర కాలము జీవించియుండిరి.

శ్లో॥ అథ పఞ్చనదేశ పాదపద్మే
హృది విన్యస్య విభుస్సమర్చయత్।
కతిచిద్దివసాన్యతీత్య రాజ్ఞీ
త్వ కరోదర్భకగర్భధారణమ్॥ ४८

తా॥ అనంతరము గొంతకాలమునకు శ్రీ మత్పంచనదేశుని గృపచే నాటులసింగురాజపత్ని మగశిశువుగల గర్భ ధారణను జేసెను.

శ్లో॥ యదాహి త జ్జర్భభరం వహన్తీ
తదాది సర్వ స్త్వహిత మ్బభూవ।
ప్రియేణ తత్పఞ్చ నదేశసేవాం
ప్రకుర్వతీ సా వ్యనయద్దినాని॥ ४९

తా॥ ఆరాణిగర్భమునుధరించినదిమొదలు సర్వము సేవగించి నిజ భర్తృసహితయై పంచనదేశుని సేవించుచుఁ గాల యాపన మొనర్చెను.

శ్లో॥ సామ్రృత్తికాయా మ్మనసః ప్రవృత్తిం
విన్యస్యమాసాన్కతి చిద్వ్యనైషీత్।
సింహాసనస్థేవ ప్రజానురక్షనం
ప్రకుర్వతీవావసదున్మనోరథైః॥ ५०

తా॥ కొంతకాలమూరాణిమన్ను దినుచు, మరికొంతకాలము సింహాసనాసీనయై ప్రజాపాలన మొనరించుచున్నట్లును

దౌహృద లక్షణములతో నుండెను.

శ్లో॥ సా గర్భభారా దలసాసతీ ముహు
స్థౌల్య న్నితమ్బా దవధూయచోదరే।
మధ్యే కృశత్వమ్పరిభూయ జజ్ఞయో
రారోపయన్తీవ జనై ర్వితర్క్యతే॥ ౫౧

తా॥ గర్భభారమున నారాణి "నితంబములమీది స్థౌల్య మునుదరమందుననునడుమునగల కృశతపిక్క భాగము ల నిమిడ్చెనా" యనిజనులచే నూహింపఁబడుచుండెను.

శ్లో॥ అథైకలగ్నే శుభఖేట వీక్షితే
గ్రహప్రకాణ్డే నిజతుఙ్గసంస్థితే।
అసూత పుత్త్రఞ్జన మోహనాకృతిం
విశోష్పతీ రాజ్యపదార్హ లక్షణమ్॥ ౫౨

తా॥ శుభనక్షత్రయుక్తమై గ్రహము లుచ్ఛస్థితినుండి లగ్న మును వీక్షింపుచుండ నొకశుభముహూర్తమున నా రాణి జనమోహనుడగు పుత్త్రుని గనెను.

శ్లో॥ సురాధిరాట్ క్ష్మామవతీర్ణవానితి
ప్రభీతచిత్తాః ఖలుదుష్పథానుగాః।
సమం విపశ్చి ద్ధృదయై స్సమ న్తతో
నద్యో బభూవుర్బహు నిర్మలోదకాః॥ ౫౩

తా॥ పుడమినింద్రుడు బుట్టెనని దుర్మార్గులెల్ల రా బాలుని జనన సమయమున జంకుగొనిరి; సజ్జనహృదయములు నద్యుదకములట్లు నిర్మలములయ్యెను.

శ్లో॥ పితా తదా తస్యచ జాతకర్మ కృ
ద్దదౌ ద్విజేభ్యోఽమిత సమ్మదాద్ధనమ్।

తదాదితోఽప్యర్భక ఏషవర్ధతే
వళక్ష పక్షీయ విధుర్యథాశ్రియా॥ ౨౪

తా॥ రాజాశిశువునకుజాతకర్మనొనరించినంతోషముతోలది ద్విజులకు ధనమునిచ్చెను; అదిమొదలాబాలుడును శుక్లపక్ష చంద్రునివలె నభివృద్ధి నొందుచుండెను.

శ్లో॥ తతః ప్రయాతే దశఽమేహని స్వ
పుత్రం స రాజా శరభోజినామ్నా।
చకార విప్రా దదు రాశిషస్తే
సబాలకాభ్యా మథ దమ్పతిభ్యామ్॥ ౨౫

తా॥ అంతటారాజు పదిరోజులు గడచినపిమ్మట 'శరభోజి' యనుపేరును సుతునకిడెను. విప్రులాదంపతులకు నూతనశిశువున కాశీస్సు లిడిరి.

శ్లో॥ గోదాన భూదాన హిరణ్యదానా
ద్యనేక దానాన్యపి బాడబేభ్యః
కృత్వా నిజా మ్పాఞ్చనదేశసేవా
ఙ్కుర్వ న్స తస్థౌ సుతలాలనేరతః॥ ౨౬

తా॥ గోభూదానాదుల నారాజనేకముగా నొనర్చి తదుపరి పుత్రునొసగిన యాపంచనదేశుని సేవనొనరించుచు పుత్రునుపలాలించుచుండెను.

శ్లో॥ ఏవంసరాజా పరిపాలయన్పురీ
మానన్దపూర్ణా నకరోజ్జనాంస్తతః।
యయౌ విభుఙ్కుర్వన గాయ కాగ్రణీ
శ్శ్రీ "శాంతి వేంకటరామణా" భిధన్సుధీః॥ ౨౭

తా॥ ఈవిధముగ సంతోషముననారాజు ప్రజలనానందముగఁ బాలించుచుండెను. ఇట్లుండ 'శొంఠి వెంకట్రమణయ్య' యను గాయకశిఖామణి యొకనాడు రాజుగారి వద్దకు వచ్చెను.

శ్లో॥ భువిస్థితానా మఘవత్ప్రజానాం
పాపాపనోదేన సవేఙ్కటాఖ్యః।
విపశ్చితాం హృద్రమణాత్పున స్స
గతః ప్రసిద్ధిం రమణస్స్వనామ్నా॥ ౨౭

తా॥ పాపులగువారి పాపముల దొలగింపను, పండితజనముల హృదయరంజకుడగుటనాతడు వేంకటరమణుడయ్యెను.

శ్లో॥ అహ స్తవాస్థానగత స్స్వకాలం
నేష్యామి రాజన్నితి త ఙ్జగాద।
తథేతి రాజానుమతి ఞ్చ చక్రే
విద్వాం స్తతో మానిత ఏవ దేశే॥ ౨౮

తా॥ "ఓరాజా! నీయాస్థానమునందుండి కాలక్షేపమును చేయుదు" నని యా పండితుఁడు తెలుపంగునడుగ నాత డంగీకరించెను; గాయకోత్తముడు నటనుండి సమ్మానింపఁ బడెను.

శ్లో॥ రామబ్రహ్మవిపశ్చితాఽస్య విదుష శ్శ్రీశొంఠివంశోద్భవ
శ్రీమద్వేఙ్కటశబ్దపూర్వరమణాభిఖ్యస్య సఖ్యం హ్యభూత్।
తస్మాత్తౌ సువిపశ్చితౌ విధిసతీవక్షోజభూతౌ విభో
ష్షాజీరాజమణే స్తు మోదమమల న్తౌ చక్రతుః ప్రత్యహమ్॥

తా॥ ఆ రాజాస్థానమున కాకర్ల రామబ్రహ్మముగారు సాహిత్యమందునను, శొంఠి వెంకటరమణయ్యగారు సంగీత

మునను విద్వాంసులై యన్యోన్యమైత్రినాతని నానంద పఱచు చుండిరి.

శ్లో॥ రామబ్రహ్మవిదః పుత్త్రౌ
జ్యేష్ఠః పఞ్చాపగేశ్వరః।
రామనాథోఽపరశ్చేతి
ఖ్యాతి న్నామ్నాగతౌ చ తౌ॥ ౬౧

తా॥ రామబ్రహ్మముగారి పుత్త్రులలో మొదటివాడు పంచాపగేశుడును రెండవవాడు రామనాథమను పేరుతో నుండిరి.

శ్లో॥ తయో ర్ద్వయో రధ్యయనార్థ మర్థవి
త్సపాఠశాలాం సువిచిన్త్య వర్తనే।
ప్రవేశ్య శ్రీరామకృపావలోకనా
ద్దినాన్యనైషీ ద్వృతి ముఞ్ఛకర్మణా॥ ౬౨

తా॥ రామబ్రహ్మముగారు తనపుత్త్రులనిద్దరను పాఠశాలఁ బ్రవేశపెట్టి శ్రీరామకటాక్ష ప్రసార ప్రసరితుడై రోజుల గడపుచుండెను.

శ్లో॥ తస్యామ్బుజాక్షీ బహుపుణ్యశీలా
సీతా పున ర్గర్భవతీ బభూవ।
విద్వా నయ జ్జీవనముఞ్ఛవృత్త్యా
కుర్వన్ననైషీత్సుఖ మాత్మకాలమ్॥ ౬౩

తా॥ రామబ్రహ్మముగారి ధర్మపత్నియగు సీతయు దైవకృప వలన మరల గర్భముఁ దాల్చెను. ఆపండితుఁడును ఉంఛవృత్తిచే సుఖకాలక్షేపముఁ జేయుచుండెను.

శ్లో॥ సా గర్భిణీ దౌహృదలక్షణాని
దధార పుణ్యశ్రవణానురక్తిమ్।
వేదాన్తగోష్ఠ్యాత్మవిచారణ ఇచ్ఛా
ప్రకుర్వతీ సాప్యనయద్దినాని॥ ౬౪

తా॥ ఆ పుణ్యసతియు గర్భధారణానంతరము పుణ్యకథాశ్రవణేచ్ఛయు, వేదాన్తప్రసంగాసక్తియు గలదైయుండెను.

శ్లో॥ శ్రీరామనామామృత మేవ పేయం
స్వాన్తే వినిశ్చిత్య దివా నిశ న్తత్।
సేవైవ మే భుక్తి రితి ప్రమోదా
త్సాఽయాపయ త్కాల మనన్యచిత్తా॥ ౬౫

తా॥ శ్రీరామనామామృత వారితో భగవత్సేవాభక్తిగలదై యామె కాలసమాయాపన మొనరించుచుండెను.

శ్లో॥ సా సర్వదా గానకలానులాపై
శ్శ్రీరామ పఞ్చాయతన మ్భజన్తీ।
సర్వజ్ఞమూర్తిం తనుజం సుబుద్ధిం
దేహీతి తస్దేవ మహో యయాచే॥ ౬౬

తా॥ నిరంతరమాపడతి తనయింటగల శ్రీరామవిగ్రహముల రాగాలాపములచే గీర్తించుచు 'సుబుద్ధియుసర్వజ్ఞుడునగు పుత్త్రి నొసగు' మని ప్రార్థించుచుండెను.

శ్లో॥ శక్రోఽద్య శాపా చ్ఛరభోజ్యభిఖ్యయా
భువంవతీర్ణ స్త్వితి చిన్తయ న్హరః।
ప్రత్యక్ష మస్యావనిపాలన మ్ముదా
ద్రక్ష్యామ్యహా శ్చేతి వివేశ తాంవిభుః॥ ౬౭

తా॥ 'ఇంద్రుని శాపవశమున శరభోజి రాజుగ నుద్భవించె'

నని పంచాపగేశుఁ డాతని పరిపాలనముఁ జూచుటకో
యన నా సీతామతల్లి గర్భమునఁ బ్రవేశించెను.

శ్లో॥ యదా విశ త్పఞ్చనదేశ్వర స్తదా
రరాజ సీతాముఖ మీశ కాన్తిభిః।
"సమ స్తవిద్యాభువి శిక్షయామ్యహ"
న్త్వితీవ కాన్తాసురుతేజసా బభౌ॥ ౬౮

తా॥ పంచనదేశు డా యువతి గర్భమునఁ బ్రవేశించిన దాది
యాయమ ముఖశోభ యతిశయించెను, సర్వవిద్యల
నీపృథివి నెలకొల్పి యొజ్జయగుదునాయన్నట్లు గురు
తేజముతో నామెయొప్పారెను.

శ్లో॥ కాలే గతే పఞ్చ శుభగ్రహాన్వితే
శుభే విలగ్నే సుషువే కుమారకమ్।
సుతాఖిలాహ్లాదిముఖస్య దర్శనా
త్తదా మహానన్ద మవాపతు శ్చ తౌ॥ ౬౯

తా॥ కొంతకాలమునకు పంచ శుభగ్రహములొక్కటఁగూడి
యుండగా శుభలగ్నమున నాసతియొక కుమారునిగనెను,
ఆపుత్త్రదర్శనభాగ్యమున నాదంపతులుమురియుచుండిరి.

శ్లో॥ అష్టాదశ శతాబ్దాదౌ
హూణమానశకే కలౌ।
సామవేదస్య సార స్తం
జనయామాస సార్భకమ్॥ ౭౦

తా॥ ఆంగ్ల శకపద్ధతిగా పదునెనిమిదవ శతాబ్దాదియం
దాసీత సామవేదసారమగు మగశిశువునుగనెను.

శ్లో॥ యదా జని స్తస్య కుమారకస్య
తదాఽజని ప్రస్ఫుట ముద్గిరాం ధీః।
యథా ప్రసన్నా సుమనః ప్రవృత్తి
స్తథాఽప్రసన్న ఖ్యవిపశ్చితాంస్యాత్॥ ౭౧

తా॥ ఆశిశువుజననమందినవెంటనే ప్రగల్భములాడువారిబుద్ధి వికలమయ్యెను; పండితులెంతగ సంతసించిరో కుకవు లంతగ కలుషితులైరి.

శ్లో॥ శ్రీమత్పఞ్చనదేశదేశ గవిభో శ్శ్రీత్యాగరాజస్య య
త్పూర్ణానుగ్రహకారణా దుదభవ త్పుత్త్రో మమాయం ధృవమ్।
తస్మాదస్య తు నామధేయ మమలం శ్రీత్యాగరాజాభిధం
కర్తవ్యస్త్వితి చిన్తయ న్స్వకృతవాంచ్ఛ్రీత్యాగరాజం సతమ్॥

తా॥ అంత రామబ్రహ్మముగారు 'శ్రీ పంచనదేశుని కృప వలన నాకీపుత్త్రుడుద్భవించె' నని యాశిశువునకు త్యాగరాజను నామధేయమొనరించెను.

మాలినీ॥ హిమగిరితటమూలే వాసిన శ్చన్ద్రమౌళే
స్సుతనయజననాత్తే స్వర్గిణో మోద మాపుః।
భువి సకలజనా స్సన్తోష మాపు ర్నితాన్తం
విధికృతవినుతే స్తద్బాలక స్యోద్భవేన॥ ౭౩

గద్య॥ ఇతి శ్రీహయవదనపాదారవిందవరివస్యాఽసాదితోభయ కవితావతా శ్రీమల్లంకోపనామక సీతారామశాస్త్రిణా విరచితే శ్రీత్యాగరాజచరితామృతే
ప్రథమస్సర్గస్సమాప్తః



# ద్వితీయస్సర్గః

శ్లో॥ ఈశ స్స్వధామాద్య విహాయ భూమౌ
కాకర్లవం శేఽవ్యదభూ ది తీర్థమ్।
ప్రోత్రి ప్రవ్యకుర్వ_స్త్రి జనా శ్శిశు స్తం
ధన్యోఽస్మ్యహ శ్చే తి పితా వ్యమంస్త॥ ౧

తా॥ పంచనదేశుడేయూశిశువుగా జనించికాకర్లవారివంశము నుద్ధరింపబూనెనని జనులందరతనిని గొనియాడిరి, తండ్రియగు రామబ్రహ్మముగారును ధన్యుడనైతిగదా యని సంతసించుచుండెను.

శ్లో॥ బహుధా పితరం స చా ర్భకో
వ్యదధి ఇృస్టర్రి ఇవ ప్రమోదయన్।
వవృధే లసదఙ్గ వైభవై
శ్శతధా స్వీయ విలాసచేష్టితైః॥ ౨

తా॥ ఆబాలుడుపచీయమానుడై యాటపాటలందల్లిదండ్రుల ననేక విధములగా నానందపెట్టుచుండెను.

శ్లో॥ మాసత్రయా దూర్ధ్వ మసౌ శిశు ర్మహీ
మాలమ్బ్య గన్తు మ్పరిచచాల చోరసా।
మాసేషు షట్స్వాసగతేషు బాలకః
క్రమై ర్విచిత్రైః పితృతోష కోఽభవత్॥ ౩

తా॥ మూడు నెలలు వచ్చునప్పటికా బాలుడు పారాడఁ జొచ్చెను; ఆరవ నెల ప్రాప్తించు సరికా యర్భకుడు విచిత్రముగ తప్పటడుగులఁ బలికండ్రుల కానంద మొడఁగూర్చెను.

శ్లో॥ అలాప మాకర్ణ్య పితా తదీయ
శ్చౌలాదికఙ్కర్మ చకార వంశ్యమ్।
బాలో ప్యసామాన్య ఇతి స్వబుద్ధ్యా
కాలోచితా న్యాచర దాత్మజస్య॥ ४

తా॥ ఆపిల్లవాని పలుకులువిని యానందించి తండ్రియగు రామబ్రహ్మముగారు వంశానుగతముగ చౌలాదికము నొనరించి యటుపై నాయాకాలములందొనరింపఁదగిన చూడాకర్మాదికమును త్యాగరాజున కొనరించెను.

శ్లో॥ యదాఽబ్ద మేకం సమగా చ్ఛిశు స్త
త్తదాది సమ్భాషణ మాచకార।
ముదావహా స్తం పరిదృశ్య బాలం
ముహుర్ముహు ర్మోద మవాపు రాప్తాః॥ ५

తా॥ ఒక సంవత్సర వయస్సుఁబొందునప్పటి కాశిశువు సంభాషణ కుపక్రమించెను; అంత నతనినిచూచిబంధుగులెల్లరు మాటిమాటి కానందమొందిరి.

శ్లో॥ పఞ్చాబ్దవా నర్భక ఇ త్యమస్త ము
ద్విద్యాలయ స్తం స్వపితా [illegible]
షణ్మాసపర్య న్త మధీత్య బాలకో
విద్యాలయో క్తాఖిల మగ్రహీ ద[illegible]॥

తా॥ ఆబాలు నయిదవయేటం బాఠశాల కనిపిరి. ఆ సెలల వఱ కాబఁక చదువు నంతయు గ్రహించెను.

శ్లో॥ దృష్ట్వాఽవ త ద్దీపటుతాంపితా శిశో
గీర్వాణవాణీ మపి పాఠయ న్స్వతమ్।
తేషా ష్ప్రకారాత్మగతాధికారతః
కావ్యాదికం సర్వ మసౌ గృహీతవాన్॥ ౭

తా॥ ఆబాలుని బుద్ధిపై శిష్యమును గని పెట్టి సంస్కృతవాణి నాతనికి నేర్పవలయునని తనశక్తికొలదితండ్రియుంను శిక్ష జేసెను; బాలుడును కావ్యనాటకాదులనన్నిటిని నేర్చెను

శ్లో॥ గర్భాష్ట మోఽబ్ది స్స్వ సుతేన లబ్ధిః
పూర్వానుచారేణచ శాస్త్ర రీత్యా।
గాయత్రమంత్రావసరం విదిత్వా
ప్రావేశయ త్ప్రిజమి కాశ్రమే తమ్॥ ౮

తా॥ తనకుమారున కష్టవర్షములు వచ్చినవని యా రామ బ్రహ్మపండితుడు శాస్త్రప్రకార మాచారమురీతి నా తనికి గాయత్రీమంత్రముపదేశించిబ్రహ్మచర్యమునం బ్రవేశ పెట్టెను.

శ్లో॥ స బ్రహ్మచారీ గురుణో పదిష్టాం
విద్యాముమ్మ దోపాస్య సమర్హణేన।
ప్రాప్తాహుతి ర్వహ్ని రివాతిపూత
స్సమార్గదర్శీ ప్రబభౌ స్వవంశే॥ ౯

తా॥ గురూపదిష్టవిద్యయగు గాయత్రీ మంత్రోపాసనమున నా బాల్యుండాజ్యాదులచే హోమమునొందిన యగ్నివలెం బ్రకాశించుచు మార్గదర్శకుడయ్యెను.

శ్లో॥ అథ పఞ్చ నదేశ పత్తనం
శరభోజీ స విహాయ ప్రాక్తనమ్।
పరివారయుత స్స పణ్డిత
స్సమగా త్తఞ్జపురం నృపాలయమ్॥ ౧౦

తా॥ అంతలో శరభోజిమహారాజు పంచనదేశక్షేత్రమగు నా తిరువయ్యారును వదలి పరివారసమేతముగా రాజధానియగు తంజాపురమును జేరెను.

శ్లో॥ శ్రీ శొంఠివేంకట్రమణోఽపి విద్వా
న్రాజ్ఞా తు త త్తంజపురం జగామ।
శ్రీరామబ్రహ్మ తిరువాయు గ్రామే
త్వధ్యాపయామాస సుతం హి విద్యామ్॥ ౧౧

తా॥ ఆ రాజాస్థానకవియగు శొంఠి వెంకటరమణయ్యగారు రాజుతో నాతంజపురమునకుఁ జేరిరి. ఉంఛవృత్తిపై నాధారముగల రామబ్రహ్మపండితుఁడా పంచనదక్షేత్రమును వదలక పిల్లవానిని చదివించుచుండెను.

శ్లో॥ సీతాపి త త్పఞ్చనదేశ దేవం
నిత్యం మ్పుజ స్త్రీత మనన్య చిత్తా।
తస్యాః పతి శ్శ్రీపతిపాదపద్మం
ధ్యాయం శ్చిరా ద్వృద్ధదశా మవాప॥ ౧౨

తా॥ సీతామతల్లియు నాపంచాపగేశుని, భర్తను సేవించుచుండెను. భర్తయగు నారామబ్రహ్మముగారును భగవంతుని స్మరించుచు వృద్ధదశ నొందెను,

శ్లో॥ త్రయాణాం పుత్త్రాణా మపి ప్రథమజో మూర్ధధిషణో
ద్వితీ యోఽప్యాసీ త్త త్త్రితమ సుత మార్గాసు సరణః

తృతీ యోఽయం పుత్త్రః పరమధిషణో జాత ఇతి త
ద్విచి న్త్యాముం వేఙ్కట్రమణ పద సేవార్థ మనయత్॥

తా॥ ఆరామబ్రహ్మముగారు తన మువ్వురు పుత్త్రులలో మొదటియిద్దరును పరమ మూఢులనియు, మూడవ పుత్త్రుడు శ్రీత్యాగరాజే బుద్ధిమంతుడని విద్యకొఱకై శ్రీ శొంఠివెంకటరమణయ్యగారివద్ద కాతనిఁ బంపెను.

శ్లో॥ రామబ్రహ్మబుధాగ్రణీ ర్నిజసుత స్తఞ్జాపురం ప్రేష్య త
త్తిర్వాయూరుపురే వస న్నిజసుతౌ వ్యర్థావితి స్వాత్మనః
వృద్ధత్వా న్మనసి వ్యథా మనుభవ న్పఞ్చాపగేశం విభుం
ధ్యాయన్కాల మహో నయ న్నసుఖధీ రాసీ దపాపక్షితః॥

తా॥ తృతీయ పుత్త్రుడగు త్యాగరాజును తంజాపుర మనిపి యారామబ్రహ్మముగారు తన కుమారులలో పెద్దవారిద్దఱు వ్యర్థులెరని వ్యథనొందుచు వృద్ధుడగుట కారణముగా సుఖదూరుడై యుండెను.

శ్లో॥ శ్రీ శొంఠివేఙ్కట్రమణాఖ్య సేవాం
శ్రీత్యాగరాజః పరికల్ప్య సర్వమ్।
సఙ్గీతశాస్త్రం సరహస్యజాలం
జగ్రాహ మాతృ స్తన దుగ్ధ వ త్సః॥ ౧౫

తా॥ ఆ శొంఠివేంకటరమణ విద్వాంసుని సేవించి శ్రీత్యాగరాజు సంగీతశాస్త్ర మర్మములెల్ల వత్సము గోస్తన దుగ్ధము గ్రోలు పగిది గ్రహించెను.

శ్లో॥ శాస్త్ర స్తు సర్వం సముదీర్య తస్య
రా గేఽపి తాళే స్వరకల్పనే చ।

సమ్పూర్ణశక్తిం పరికల్ప్య తస్మై
మోద మ్ప్రప ద్యాఽహ గురు స్స్వశిష్యమ్॥ ౧౬

తా॥ ఆత్యాగరాజునకు గురువిట్లు సంగీత శాస్త్ర మర్మము లెల్ల జెప్పి పరిపూర్ణ శక్తివంతునిగ నొనరించి సంతోషమున శిష్యుని బిలిచి యిట్లనెను.

శ్లో॥ త్యాగరాజ। తవ శాస్త్రపాటవం
ద్రష్టు మద్య మమ చాభవ న్మనః।
తేన త త్ప్రకట యాగ్రత శ్చ మే
త త్ప ది త్యనుమతి శ్చకార సః॥ ౧౭

తా। "ఓయీ! త్యాగరాజ! నీగాన విద్యా నైపుణ్యమును జూడ నామది నింపుగొల్పుచున్నది; ఒక్కపరి నాయెదుటవిసపింపు"మనియెను;అతడట్లేయనియంగీకరించెను.

శ్లో॥ అథైకదా పణ్డిత మణ్డలా వృతాం
సభా మ్ప్రక ల్ప్యాహ గురుః పురా మయా।
యదు క్త ముత్య స్త మథ త్వయా ధునా
స్వధితశాస్త్ర మ్ప్రకటీకురుష్వ తత్॥ ౧౮

తా। పిమ్మట నొకనాడావేంకటరమణ గురువర్యుడొక పండితసభను గావించి యాతనితో "ఓయీ! నేనేమి నీకు జెప్పితినో,నీవునావద్దనుండి గ్రహించినదెట్టిదియో ప్రకటింపుము" అని పలికెను.

శ్లో॥ ఇత్యుక్త మాచార్యవరై స్స తోఽధికం
సమాలప న్నాగ మపూర్వశోభమ్।
తదానురూపం లయతాలమానం
ప్రదర్శయ న్నద్భుత మాదకార॥ ౧౯

తా॥ గురువుగారు తనకుఁజెప్పినదానికన్న మేధచే నధికముగా దన విద్యానైపుణ్యమును బ్రదర్శించుచు లయతాలరీతులఁ నత్యపూర్వముగా రాగాలాప మారంభించెను.

శ్లో॥ భావానురూపాక్షరసఙ్గతి స్తద్
రాగానురూపాం లయతాలరీతిమ్,
గేయానురూప మ్పరికల్ప్య తానం
సర్వం శ్రుతే శ్శాస్త్ర మి వానురూపమ్॥ ౨౦

తా॥ భావానుబోధకముగ నక్షరవిన్యాసమును, విన్యాసమునురాగముతోనుమేళవించి లయతాళమానముల గాపాడుకొనుచు గేయములఁబాడి తానమునుబ్రదర్శించుచు శ్రుతిననుసరించిన శాస్త్రమువలె శ్రుతిననుసరించి సంగీతశాస్త్రము జూపెను.

శ్లో॥ తాళేషు కాల క్షమయం చ్ఛ్రితిం స్తాం
రాగానురూపా మ్పరితః ప్రపశ్యన్।
సమ్మేక్ష్య సమ్య క్ప్రిజగౌ చకాశే
చామోదసమ్పన్న సువర్ణవ త్సః॥ ౨౧

తా॥ శ్రుతిననుసరించి పాడునట్టి యాసంగీతమును తాలమునకనుగుణముగ కాలమును జూపించుచుశ్రోతాౢనందముగ గానముఁజేయుచు బంగారమునకు పరిమళము వరిన రీతిఁబ్రకాశించెను.

శ్లో॥ ఆరోహణే చా ప్యవరోహణే చ
స్థాయిస్వరూపానుగతం సలీలం।
గాయ స్తదా సంసది యౌవనాన్వితో
రే జేఽతికాన్త్యా హరిపోతవ త్సః॥ ౨౨

తా॥ ఆరోహణావరోహణములలో స్థాయి కనుగుణముగ విలాసమునగీర్తించుచు నాసభయందు సింహకిశోరము వగిది భాసించు చుండెను.

శ్లో॥ గానే తదీయా గతివైఖరీం శుభాం
దృష్ట్వా గురుః పణ్డితపుఙ్గవా ముదమ్।
సమ్ప్రాప్య తత్సంసది సంస్థితా జనా
శ్చిత్రార్పితా స్తస్థురివాతివిస్మయాత్॥ ౨౩

తా॥ గానవిద్యయందాతని వైఖరినిగని గురువగు వేంకటరమణుడెంతయనో సంతసించెను. ఆనాడా సభయందున్న వారు చిత్తరువున నున్నట్లు విస్మయా విష్టులైరి.

శ్లో॥ అనన్యసాధారణ పాణ్డితీ ప్రభా
మనన్య సాధారణ భక్తి వైఖరీమ్।
అనన్య శాస్త్ర ప్రతిభా మలోకయ
న్ననన్య చిత్తాః ఖలు తత్ర పణ్డితాః॥ ౨౪

తా॥ అనన్యజనసామాన్యమగు నాతని పాండిత్య, భక్తి, ప్రతిభలకు నచ్చటి వారెల్లరేకాగ్రమనస్కులై యుండిరి.

శ్లో॥ కిం వీణాక్వణనం గళా త్సముదితో గానస్వనః స్తుమ్బురుః
క్ష్మా మాసాద్య నిజోరుగానపటుతా జ్ఞ్యాప్యయ న్నాస్థితః।
కిం స్వప్నః; కిము తాథ భూమిరభవద్గన్ధర్వలోకోఽధునా;
కిం శేషః; కి మయన్ను కిన్నర ఇతిప్రోచు స్సభాయాంస్థితాః॥

తా॥ ఇది గళమునుండి వచ్చినధ్వనియా? లేక వీణానినాదమా? లేక తుంబురుడు భూలోకమున తన పాండిత్య ప్రదర్శనముఁ జేయుచుండెనా? లేక స్వప్నమా? లేక

ఇది గంధర్వలోకమా? ఆదిశేషుడా యితడు? కానిచో కిన్నరుడెవ్వడే నిట్లుపాడుచుండెనా? యని యాసభా సదులెల్లరాశ్చర్య నిమగ్నులైరి.

శ్లో॥ కేచి త్ప్రశంసు స్త మపూర్వగాయకం
కే చి త్త మానన్దకరం ప్రతుష్టువుః।
కేచి న్ననన్దు స్సుకృత స్త తత్కృతం
శ్రీత్యాగరాజం ప్రశశంసు రన్వహమ్॥ ౨౭

తా॥ ఆత్యాగరాజును కొందరు ప్రశంసించిరి; కొందఱు స్తోత్రమొనరించిరి; కొందరాతని సుకృతమును గూర్చి యానందపడిరి.

శ్లో॥ గురు స్తు వేంకట్రమణాభిధ స్తతః
పదిం సమాశ్లిష్య ముదా స్వచేతసా
చిరం వివర్ధస్వ యశోభి రన్వహం
త్వి తీరయామాస శుభై ర్విజాశయైః॥ ౨౮

తా॥ గురువగు వేంకటరమణమూర్తియు శిష్యుడగు నా త్యాగరాజు నాలింగన మొనరించి "ఓయీ! నీవు చాల కాలము కీర్తిపరిశిష్టలతో విలసిల్లగలవు" అని దీవించి పలికెను.

శ్లో॥ ప్రీణామి తే గానకళావిశేషాన్
గత్వాఽద్య తే సద్మ వధూ ఙ్కులీనామ్।
ఉద్వాహ్య సుప్రేమభరేణ పుత్రాి
మత్పాద్య నిర్యాతయ త త్పితౄణామ్॥ ౨౯

తా॥ "నీగానకళాకౌశలమున కానందించితిని, ఇంతట నీగృహమునకేగి వివాహ మొనరించుకొని ప్రియురాలితో

సంతతినిగని పితౄణమును దీర్చుకొను" మని గురు వాతని నింటికంపెను,

శ్లో॥ అథ తజ్జపురా ద్విజనిర్గత
స్స్వపుర ప్పుణ్యనదేశ పత్తనమ్।
తిరువాయుపుర మ్ప్రిపద్య త
త్పితరౌ తుష్టి మవాపము న్స్థితః॥ ౨౯

తా॥ అనంతర మాత్యాగరాజు తంజాపురమునుండిబయలు వెడలి తల్లిదండ్రులు నివసించు శ్రీపంచనదేశ్వర క్షేత్రమగు తిరువయ్యారునకువచ్చి తల్లిదండ్రుల సంతోష పఱచు చుండెను.

శ్లో॥ రామబ్రహ్మసుధీ స్స్వపుత్త్రి మపి త స్సృష్ట్వా ముదంప్రాప్యతౌ
షత్త్రౌ ద్వా వథ సంస్థితి మ్పరిగతా వి త్యస్త్ర రక్షై వ్యథా
మాప్త్వా రామపదార్చన న్నిజసతీ యుక్త స్తు భక్త్యా సదా
కాల ఞ్చానయ దన్యకార్యవిధుర శ్రీత్యాగరాజేన సః॥ ౩౦

తా॥ రామబ్రహ్మపండితుండా పుత్త్రుని పండితునిగా నెఱింగి మనమున నానందపడుచు జ్యేష్ఠులిద్దరు తిప్పకాయలై రేయని వ్యథనొందుచు శ్రీరామపంచాయతనపూజం గావించుకొనుచు కాలయాపనముఁ జేయుచుండెను.

శ్లో॥ శ్రీత్యాగరాజోఽపి నిజోరువిద్యయా
పిత్రార్చ్యమానం రఘురామవిగ్రహమ్।
స్తువ న్స్వకాలం పితుర న్తికే నయన్
పూజార్థ మర్థా న్పరికల్పయన్ స్థితః॥ ౩౧

తా॥ ఆ త్యాగరాజుతనగానకళతో తండ్రిచేఁ బూజింపబడు

శ్రీరామునిగీర్తించుచు పూజాదులందిచ్చుచు తండ్రి సమీపమున నే కాలము గడుపుచుండెను.

శ్లో॥ సుధోపమ స్వీయ కళా ప్రదర్శనా
ద్వైరాగ్యమార్గా ద్వరభక్తిగౌరవాత్,
త స్యాస్య పుత్త్రస్య సుకీర్తి రావిశ
ద్దూరా త్సుమ స్యేవ సుగన్ధసఙ్గతిః॥ ౩౨

తా॥ అమృతతుల్యమగు గానకలా పాటవమునను, భక్తి వైరాగ్యముల గూడియుండుటవలన నాత్యాగరాజ కీర్తిసుమము పరిమళమును వెదజల్లుచుండెను.

శ్లో॥ జ్యేష్ఠద్వితీయౌ పరిణీతవన్తౌ
సౌఖ్యేన కాలం భువి యాపయన్తౌ,
విహాయ ధర్మం పరకీయవృత్తి
మాస్థాయ పిత్ర్యా జ్జహతు ర్విభు న్తౌ॥ ౩౩

తా॥ జ్యేష్ఠపుత్రులిరువురును పిత్ర్యమునాసింపక యే స్వధర్మత్యాగమొనరించి లౌక్యవృత్తిఁ బ్రవేశించి సుఖ కాలక్షేపమున నుండిరి.

శ్లో॥ గతే చ కాలే జననీ దివ ఙ్గతా
పితా ప్యనారోగ్య మవాప తన్మృతేః,
తదీయసేవా సుకృతేన చా న్తిమః
పిత్రార్చ్యమానం హరి మర్చయ న్స్థితః॥ ౩౪

తా॥ ఇట్లుండఁ గొంతకాలమునకారామబ్రహ్మముగారి ధర్మపత్ని స్వర్గమున కేగెను. దాన నాతడు మిక్కిలి తగా గృశించి యనారోగ్యముగ నుండెను. కడ

పుత్త్రుడగు త్యాగయ్య తండ్రిని సేవించి విగ్రహములఁ బూజించుచుండెను.

శ్లో॥ తృతీయపుత్త్రస్య చ సోఽథ యోగ్యాం
కన్యాం వివాహోపయమ ఇచ్ఛకార।
తస్యాస్య గేహం కమలావిలాస
యోగ్య ఇచ్ఛకా రార్థపతా మనామ్నా॥ 37

తా॥ ఆరామబ్రహ్మముగారు తనమూడవ కుమారునకు వివాహ మొనరింపబూని కమలానివాసగృహ మొనరింప కమలయను నాపెఁ బెండ్లిచేసెను.

శ్లో॥ కాలక్రమేణ జ్వరపీడనేన
భార్యావియోగేన జరాభరేణ
పఞ్చత్వ మాసాద్య పితాఽపి తస్య
నాకం యయా వాప్తమనోరథ స్సః॥ 38

తా॥ కాలక్రమమున నాత్యాగరాజు తండ్రి జరాభారము చేతను, పత్నీవియోగముచేతను [illegible] స్వర్గ ధామ మలంకరించెను.

శ్లో॥ పత్న్యా సహ స్వాత్మ[illegible] స్స [illegible]
స పైతృక ఙ్కర్మ [illegible]
తత్పుత్త్రదత్తై స్స[illegible]దకై [illegible]
పుణ్యా ఙ్గతి మ్ప్రాప [illegible] తదానీమ్॥

తా॥ రామబ్రహ్మముగారి మూడవ [illegible] రాజు తనభార్యతోడ గూడ పై [illegible] చెను, దాన తండ్రి పుణ్యగతిని బొందెను.

శ్లో॥ రామబ్రహ్మమృతే రవ స్తరదినే పఞ్చాపగేశ స్సుతో
బాబాజ్యా స్నిజపిత్ర్య మర్థ మతులం శ్రీరామనాధ శ్చ తత్
సమ్మన్యాపి విభాగ మాపతు రవ శ్రీత్యాగరాజేన తా
నజ్ఞ్మహ్యాపిల వస్తు తత్పుజతు రావంశాగతం శ్రీహరిమ్॥

తా॥ రామబ్రహ్మముగారిట్లు మృతిజెందిన వెంటనే యాతని జ్యేష్ఠసుతుఁడిద్దఱును త్యాగరాజుతోఁగూడ చాలోచించి విభాగమునొంది యందు రాదగిన ధనమును వస్తువుం నన్నిటిసిగొని వంశానుగతమగు శ్రీరాముని పంచాయతనమును మాత్రముపదలిరి.

శ్లో॥ త్యాగరాజహృదయ మ్పరిపూతం
మేవ మూప్య రఘురామవిగ్రహః।
స్వేనలబ్ధ ఇతి పుణ్యకర్మణా
తం స్వదేవ మురరీచకార సః॥ ౩౯

తా॥ 'శ్రీరామ విగ్రహములు తనవంతువచ్చినవిగదా' యని త్యాగరాజు చాలసంతసించి యాదేవుని కన్నుల కద్దుకొని పరిగ్రహించెను.

శ్లో॥ - ఆదాయ పఞ్చాయతనస్వరూపం
శ్రీరామదేవం వినివేశ్య గేహే।
రాత్రిన్దివ స్తత్పద మర్చయన్తౌ
జాయాపతీ తౌ నిజభక్తియుక్తౌ॥ ౪౦

తా॥ పంచాయతనస్వరూపమగు నా శ్రీరామవిగ్రహముల గొని యా త్యాగరాజదంపతు లతిభక్తిభావమున రాత్రిం దివములు సేవించు చుండిరి.

శ్లో॥ కమలా విమలాఽచ్యుతార్చనా
దమలా కాల మయాపయ త్సతీ।
పర మాఽతిరమా ప్రజావనే
పరమానన్దపతీ బభూవ సా॥ ౪౧

తా॥ అచ్యుతార్చనమున కమల విమలయ్యె సరిగదా! ప్రజారక్షణము నకూడనామెపరమానందకరురాలయ్యె.

శ్లో॥ స త్యాగరాజోఽపి దివానిశ స్త
చ్ఛ్రీరామదేవ స్తస్సుసేవమానః।
మోదయ న్స్వబుద్ధ్యాఽపగతః ప్రవాహో
గానేన తత్కీర్తన మాచకార॥ ౪౨

తా॥ త్యాగరాజపగిది శ్రీ రామచంద్రుని సేవించుచు నడుమ నడుమ నుద్రేకమున రాముని గానముతో గీర్తించెను.

శ్లో॥ భార్యాఽపి తద్గానసుధా మపూర్వా
ముత్కృష్టభక్త్యా రసవత్తమా స్తామ్।
శ్రీరామనామాఙ్కితపుణ్యగన్ధాం
శ్రుత్యా పపౌ నన్దితచిత్త వృత్తిః॥ ౪౩

తా॥ ఆత్యాగరాజపత్నియు రసవత్తరమగు గాన సుధను భక్తితో మేళవించి శ్రీరామనామమను పరిమళముతో గూడినదానినిగా తెలిసికొని శ్రవణాంజలిచే పానము జేసెను.

శ్లో॥ సా ప్యేకదా భక్తిసమావృతేన
హృదాఽతిపూతా స్తులసీ స్ననామ।

ప్రత్యక్షభూతా కృపయాఽఽలప న్తీ
త క్రాన్తరే తత్పతి రాజగామ॥ ౪౪

తా॥ ఒకరోజున కమలాంబికభక్తితో తులసీదేవినిబూజించు చుండెను. ఇంతలో నామెకాదేవి ప్రత్యక్షమయ్యెను. ప్రత్యక్షమైన దేవితో మాట్లాడుచుండగా నామె భర్తయగు త్యాగరాజట కేతెంచెను.

శ్లో॥ దేవీ తదా త స్యావలోకయ న్తీ
సాఽన్తర్హితా దృష్టిపథా త్తయో స్సా
త త్యాగరాజ శ్చ తతః ప్రవిష్టా
మా పేదివాతా స్వాత్మని ఖిన్నభావః॥ ౪౫

తా॥ అంత టాతులసీదేవి యంతర్థాన మొందెను. త్యాగరాజు నాత్మయందెంతో నొచ్చుకొనెను.

శ్లో॥ అథాన్యపాదో బహుధా ప్రియాఞ్చ తా
మలాలయ త్సా కమ లాఽతిచిన్తయా।
దేవీం స్వచిత్తే తులసీ మమేయయా
భక్త్యా స్మర న్తీ పతి మన్వగా త్తదా॥ ౪౬

తా॥ అనంతర మా త్యాగరాజు అంతర్ధానమొందిన తులసీదేవికై వ్యథనొందుచున్న భార్యనోదార్చెను. ఆమెయు భర్తచిన్నవోవునేమోయని యాదేవిని హృదయఫలకమునఁగొల్చు చుండెను.

శ్లో॥ కాలక్రమే ణాథ తయో ర్వియోగ
కాలం సమాసాద్య రుజా త్తపీడా।
అసహ్య మృత్యో ర్ముఖ మావిశ న్తీ
పై కా న్తవాచ న్నిజగాద కాన్తమ్॥ ౪౭

తా॥ కాలక్రమమున నావంటివారల వియోగకాలమాసన్నమై యాతకమలాంబిక రోగగ్రస్తయై మృత్యువు నొంద బోవుచు భర్తతో నేకాంతముగ నిట్లు పలికెను.

శ్లో॥ అహో౽ద్య భర్తః ప్రియ పాదసేవాం
[illegible] ప్రయాస్యామి దివం త్విదానీమ్।
యదాప్య [illegible]
శ్రీరామభక్త్యా నయత స్వకాలమ్॥ ౪౮

తా॥ నాథా! నేను తమపాదసేవ వదలి యిప్పుడు దివికేగు చుంటిని; మీరు మాత్రము సుస్థిరముగ శ్రీరాముని గుణములబూజ నేమరక భక్తితో గాపించుచుం గాలయాపన మొనర్పుడు.

శ్లో॥ ఇత్యుదీర్య కమలా నయనాఖ్యా
మస్రుజాలక మముఞ్చ దతస్తాత్।
ఆద్యనంతర వివేక విహీనం
ప్రాణజాత మపి చోర్ధ్వ ముయాసీత్॥ ౪౯

తా॥ ఇట్లు పలికి యాతకమలాంబిక కన్నీరునువిడచెను. అంత ప్రాణముల వీడెను. కన్నీరెంతలో భూమిపైబడెనో యంతలోనామె ప్రాణము లూర్ధ్వముగ బోయెను.

శ్లో॥ భార్యావియోగవ్యథయా౽పి పస్తైతః
కర్తవ్యకార్యే విమతిప్రసక్తినమ్।
కుర్వ న్విరాగా దమతి స్త్వభూ దసౌ
శోకేన లోకే ధిషణా విహ్వలేః॥ ౫౦

తా॥ భార్యావియోగమున నాతడు వైరాగ్యమున నుండి కర్తవ్యకార్యములయెడ ననురక్తుడుగాక మతిభ్రష్టుని

వలెనుండెను. లోకమున శోకము బుద్ధిని మార్చును గదా!

శ్లో॥ విదాం సుసంగేన విదం వ్యపోహ్య
సదా ముదా రామపదే సనాపు।
యథా యథా వాపః ముద్గ మోఽస్య
తథాతదా కీర్తన మాచకార॥ ౫౧

తా॥ విద్వాంసుల సాంగత్యమున వియోగ వ్యధను తొలగించుకొని యెల్లప్పుడు శ్రీరాముని పదముల గొల్చుచుండెను.

శ్లో॥ ఏకా స్మృతి స్తా మనుస్మృత్య జాయాం
ప్రీతాం ప్రసీతా మృప్తి పతిస్య భిన్నః।
* "పూర్వే భవే పాప మకార్ష మేత
జ్జానామి శ్రీరామ! భవార్చనేన"॥ ౫౨

తా॥ ఇట్లు స్మృతినొందిన భార్యను గూర్చి "తొలి నేజేసిన పూజాఫలము" అనునొక కీర్తనను బాడెను.

శ్లో॥ తదీయగేయం శతధా విభక్తం
శ్రవఃప్రియం శుశ్రువు రస్య శిష్యాః।
తతః ప్రభృ త్యస్య సుకీర్తికాన్తా
దిశా ముపాస్తేష లలాస భాసా॥ ౫౩

తా॥ శతధా విభక్తమగు నాతని గేయజాలము నాతని శిష్యులు వినుచు గుర్తుంచుకొనుచుండిరి. తదాదిగా త్యాగరాజకీర్తి దశదిశల కెగబ్రాకెను.

శ్లో॥ న కేవలం త్యాగవిభో స్సుకీర్తి
ర్దిగ న్తరాళం ప్రగ తాఽథ కిస్తు।

అన్ధ్రిస్తరఙ్గేష్వపి భారతానాం
మనస్యశక్తః ప్రమదో వివేశ ॥ ౨౪

తా॥ శ్రీత్యాగరాజకీర్తి యొక్కటే దిశలం బ్రవేశించుట గాదు; భారతప్రజలయొక్క హృత్కుహరముల నైత మానందము ప్రవేశించెను.

శ్లో॥ అతులప్రతిభాం విలోక్య త
త్సుకవే ర్గాయకశేఖరస్య వై
నిజధర్మసతీ మృతి ఞ్చ తా
మశృణో త్కాశ్చన పణ్డితాగ్రణీః ॥ ౨౫

తా॥ గాయకాగ్రేసరుడగు నాతని ప్రతిభను, భార్యావియోగమును గూర్చియొక పండితుడు చెవులారవిని వ్యథ జెందెను.

శ్లో॥ తస్మై స్వపుత్త్రీ మథ దాతు మున్మనా
గానప్రవీణస్య కవేశ్చ తద్గృహమ్।
సమ్ప్రాప్య తచ్ఛోభనసఙ్గతి స్తదా
విజ్ఞాపయామాస విపశ్చిదగ్రణీః ॥ ౨౬

తా॥ ఆత్యాగరాజునకు తనపుత్త్రికనీదలంచి యాపండితు డొకనాడు త్యాగరాజగృహమునకువచ్చెను. కుశలప్రశ్న ప్రతివచనానంతర మాశుభవార్తను త్యాగరాజునకెఱుకపఱచెను.

శ్లో॥ స త్యాగరాజ స్సువిచిన్త్య చాహ
త జ్కిం వివాహే న్మమ చేహ కార్యమ్।
రామస్య పఞ్చాయతనస్య సేవాం
కుర్వ న్నహ ఙ్జీవిత మాచరిష్యే ॥ ౨౭

తా॥ త్యాగరాజావార్తవిని "ఓయీ! మహానుభావా! నా కింక వివాహమేల? శ్రీరామపాదసేవ నొనరించు కొనుచు కాలక్షేపముఁ జేసెద" నని యాపండితునితో బలికెను.

శ్లో॥ తద్వాక్య మాకర్ణ్య చ కన్యకా పితా
త మబ్రవీ ద్భోః శృణు మద్గిరం హితామ్।
సన్తానహీనస్య న చాస్తి సద్గతి
స్తస్మా ద్వివాహా దథ పుత్రివా న్భవ॥ ౫౮

తా॥ ఆవాక్యమును విని కన్యాదాత త్యాగరాజుతో "ఓయీ! నాపలుకు వినుము; సంతానహీనునకు సద్గతి లేదుగాన వివాహము చేసికొని పుత్రివంతుడవగుము.

శ్లో॥ తద్వాక్య స్త్యాగరాజ స్తు
శ్రుత్వా౽"స్మ ద్భ్రాతు రన్తికే।
ఆశ్రావయే"తి తం ప్రేష్య
దాసీ ద్రామార్చనాపరః॥ ౫౯

తా॥ త్యాగరాజావాక్యమునువిని "ఓయీ! యీవిషయ మును మాఅన్నగారి సమీపమున వినిపింపు" మని పలికి శ్రీరామార్చన తత్పరుడై యుండెను.

* శ్లో॥ రాగాద్విహీనస్య హృదన్తరే సు
జ్ఞానం జనిష్య త్యథ నాన్యమార్గాత్।
తస్మా త్వ్రిపీ దేతి విరాగబుద్ధ్యా
చైకా మ్మనోజ్ఞాం కృతి మాజగౌ సః॥ ౬౦

తా॥ రాగరహితుని హృదయమందు జ్ఞానము గలుగదు;

అందుచే నాయందు దయగలిగి యనుగ్రహింపుమని యొక కృతి నాత్యాగరాజు రచించెను.

శ్లో॥ కన్యాదా తాऽథ గత్వా త
ద్వార్తరం సర్వ మబ్రవీత్।
సోऽపి నిశ్చిత్య సమ్బన్ధం
ప్రేరయామాస సోదరమ్॥ ౬౧

తా॥ కన్యాదాతయతనియన్నగారితో గూడసీవార్తనుజెప్పెను. అతడును సంబంధమును నిశ్చయపరచుకొని సోదరు నందులకొప్పించెను.

శ్లో॥ స్వేన స్వధర్మ స్త్వద కర్తు ముద్యతాం
ధర్మాలయం ధర్మపరా ఇచ్చ మానినీమ్।
ధర్మామ్బికాఖ్యాం సుగుణా మ్మనోహరాం
స చోపయేమేऽర్ధవతీం సుబాలికామ్॥ ౬౨

తా॥ పిమ్మట తనతోగూడి ధర్మమునాచరించుటకై వచ్చిన ధర్మమూర్తియా యనునటుల ధర్మాంబికయను నామె నాతడు వివాహముఁజేసికొనియెను.

మాలినీ॥ గత విజదయిత శ్రీదక్షిణామూర్తిదేవో
హిమగిరి తనయా స్తాం చోపయేమే సురార్థమ్।
విబుధపతిముఖాం స్తాం స్తోషయామాస యద్వ
త్తదుపయమ మవాప త్యాగరాజః ప్రజార్థమ్॥

గద్య॥ శ్రీహయవదన పాదారవింద వరివస్యాసాదితోభయ
కవితా వతా శ్రీ మల్లంకోపనామక
సీతారామశాస్త్రిణావిరచితే శ్రీత్యాగ
రాజ చరితామృతే ద్వితీయస్సర్గ
స్సమాప్తః

## తృతీయస్సర్గః

శ్లో॥ ఏవం ద్వితీయా సహితస్సపూజ్య
శ్రీత్యాగరాజః పరమార్థ దృష్టిమ్।
సఙ్గృహ్య కాల స్తేన య త్తద న్తః
కేచిత్త మా జగ్మురబాలశిష్యాః॥ ౧

తా॥ ఇట్లా త్యాగరాజు భార్యాసహితుడై పరమార్థ దృష్టితోఁ గాలము బుచ్చుచుండెను. ఇంతలో నాతనివద్దకు గొందరు వృద్ధ శిష్యులేతెంచిరి.

శ్లో॥ ఆగత్య తం పూజ్యవరం విభో! త్వ
మానన్ద శాస్త్రేణ సుశిక్షయాస్మాన్।
ఇతీరయన్త శ్చరణే ప్రణేము
స్సఙ్గీత శాస్త్రస్యధిగన్తు కామాః॥ ౨

తా॥ ఇట్లు శిష్యులువచ్చి యాత్యాగరాజుకడ సంగీతశాస్త్రము నభ్యసింపగోరి నమస్కారములతో బ్రార్థించిరి.

శ్లో॥ అఙ్గీచకారాత్మ గతాన్స్వరామ
ప్రసేవనా యోప గతాన్వినీతాన్।
శ్రీత్యాగరాజశ్చ చకార రాగా
చ్ఛిష్యాన్స్వశాస్త్రే విదుషః ప్రభూతాన్॥ ౩

తా॥ తనతోఁగూడ శ్రీరాముని సేవించి తరించుటకు వారు వచ్చినారను భావముతో (శిష్యులను భావములేక) తనకుగల సంగీతశాస్త్రమును వారికి నేర్పి విద్వాంసుల గావించెను.

శ్లో॥ తే బుద్ధికౌశల్యవశా త్తదీయం
శాస్త్ర స్తదస్తే వసనా చ్చ శీలమ్।
దేవే ప్రపత్తి మ్పరిగృహ్య ప్రీత్యా
సిషేవిరే దేశకపాదపద్మమ్॥ ౪

తా॥ ఆశిష్యులును త్యాగరాజ గురువరుని సేవించుటవలన శాస్త్రము నేకాక శీలమును, భక్తిప్రపత్తులనేర్చి యానందమున నాగురుపాదముల సేవించుచుండిరి.

శ్లో॥ కుప్పయాఖ్యసుధీ ర్గణేశవిబుధ శ్శ్రీసుబ్బరామాహ్వయో
వ్యయ్యాభాగవత శ్చ కన్నయ ఇతి శ్రీకృష్ణయాఖ్యోపరః।
శ్రీమద్వేఙ్కటసూరి రర్థనిపుణ శ్శ్రీనీలకణ్ఠాహ్వయో
వ్యష్టౌ శిష్యవరా స్తదీయ సుయశోవ్యాప్తి ర్దిశో విస్యరే॥

తా॥ (1) వీణె కుప్పయ్య, (2) గణేశులు, (3) సుబ్బరామయ్య. (4) అయ్యాభాగవతార్ (5) కన్నయ్య, (6) కృష్ణయ్య. (7) వేంకటమఖి, (8) నీలకంఠయ్య అనువారలెనిమిదిమందియాతనిశిష్యులుగానుండి పండితులైదిగష్టకము నాత్యాగరాజకీర్తిని వ్యాపింపజేసిరి,

శ్లో॥ తచ్ఛిష్యబృన్దా న్యఖిలాసు దిక్షు
శ్రీత్యాగరాజస్య యశో ఽవయం స్తత్।
తే నేడితః ప్రీతియుతానుగేయై
శ్శ్రీరామచన్ద్రో ఽతిముద మ్ప్రపేదే॥ ౬

తా॥ ఆశిష్యులు దశదిశలకాతని కీర్తనలతోబాటు శ్రీరామునిపైగల భక్తినిగూడ ప్రకటించి జనుల నానందమున నోలలార్చిరి.

శ్లో॥ తత్త్యాగరాజస్య వితాస్తథక్తే
వైరాగ్యభావస్య ముముక్షితాయాః।
మోదం ప్రపద్యానుజిఘృక్షమాణ
శ్శ్రీరామచన్ద్రో౽భవదక్షిలక్ష్యః॥ ౩

తా॥ ఆత్యాగరాజ భక్తివైరాగ్యములకు, ముముక్షుత్వకు శ్రీరామచంద్రమూర్తి యాత్మ నధికముగ సంతసించి యనుగ్రహింపఁదలచి దృగ్గోచరుడయ్యెను.

శ్లో॥ ప్రసన్నభూతం రఘురామవిగ్రహం
ప్రచక్రమే స్తోతుమనన్యమానసః।
తదన్తరే కశ్చనయోగిపుఙ్గవ
స్సౌహార్దత స్తన్నిలయం సమాగమత్॥ ౪

తా॥ ఇట్లు దయతోఁదనకు ప్రసన్నుఁడగు శ్రీరాముని యాత్యాగరాజు భక్తితో స్తోత్రముఁజేయుచు నేకాగ్రచిత్తమున నుండెను. ఇంతలో నొకయోగిపుంగవుడాత్యాగరాజగృహమున కేతెంచెను.

శ్లో॥ నిమీల్లనాదక్షియుగస్య సో౽పి తం
నాపశ్య దేకాస్త్రసమాధిసంస్థితః।
స యోగిముఖ్యో౽పి తదీయభక్తియు
క్ప్రగీతి మాధుర్యవిమోహితో౽భూత్॥ ౫

తా॥ కన్నులుమూసుకొని ధ్యానయోగనిమగ్నుఁడగు త్యాగరాజు వచ్చిన యాయోగిపుంగవుని చూడకపోయెను. యోగియు కన్నులుమూసి ధ్యానించి కీర్తించు నా త్యాగరాజు గానమునువినుచు తృప్తుడయ్యెను.

శ్లో॥ గీతావసానే స చ యోగిన స్త
స్సృష్ట్వా ననా మార్గవినీతవృత్త్యా।
ఆసాద్య తద్యోగిసమీపభూమిం
సమ్భాష ణోపక్రమ మాప నీత్యా॥ ౧౦

తా॥ గానానంతరమా త్యాగరాజు యోగినిచూచి విధేయత తో నాయోగికి నమస్కరించెను. ఆయోగియాతనిపజ్జం జేరి సంభాషించుటకు మొదలిడెను.

శ్లో॥ ప్రాప్య మృవే ద్బ్రహ్మ చిదాత్మరూపం
సుకర్మభి ర్వా వ్యథ వోరుభక్త్యా।
ఇత్థ న్ద్వయో స్తన్మనిభక్తయో స్త
న్మధ్యాహ్నపర్య న్త మభూ ద్వివాదః॥ ౧౧

తా॥ బ్రహ్మత్మ్మడగుటకుసాధనములుకర్మలా? లేకభక్తియా? అని యాభక్తయోగులిద్దఱు మధ్యాహ్న సమయము వఱకు వివదించుచుండిరి.

* శ్లో॥ కి న్ద్వైత మద్వైత మహో సుఖం భో
శ్చైతన్యసాక్షిణా ఋత మద్య బ్రూహి।
పశ్చాపి భూతా న్యఖిలా న్పురా స్తే
సన్దేహవన్తో ఽత్ర విదర్శనం త్వమ్॥ ౧౨

తా॥ "ద్వైతము సుఖమా? అద్వైతముసుఖమా?". అనుకీర్తనను బాడి కర్మచే మోక్షము సాధ్యమనికొందఱు మత ముగాదలచిరి.

శ్లో॥ అ వ్యస్తి మోక్షో భువి తావకీన
భక్తిం వినా జీవవతా న్నరాణామ్।

ఓఙ్కార నాదానుగతై ర్హి సప్త
స్వరై రపి త్వా మవిజానతాన్స్తు॥ ౧౩

తా॥ 'మోక్షముకలదా? భువిలోజీవన్ముక్తులుగానివారలకు' అను కీర్తననుబాడి భక్తిచేమోక్షముసాధ్యమని మతి కొండఅమతముగ నిర్ణయించిరి.

* శ్లో॥ తత్త్వమ్పదార్థావగతి స్త్వశక్యా
శ్రీరామ నామామృత బోధ రూపా।
లోకే తు సత్వాది గుణాత్మకే ఽస్మిం
స్తత్వ మ్పదార్థా వగతి స్త్వశక్యా॥ ౧౪

తా॥ 'తత్త్వమెఱుఁగఁదరమా? పరతత్త్వమెఱుఁగఁదరమా? అనుకీర్తనను గీర్తించి తత్త్వమస్యాది మహావాక్యము లోని భావమునుబట్టి కర్మలచేగాక, భక్తిచేగాని అప వర్గము సాధ్యపడదని నిర్ణయించుకొనిరి.

* ॥శ్లో యజ్ఞై స్సుసౌఖ్య మ్మపి నాన్యతో భవే
ది త్యజ్ఞలోకాః ప్రథయన్తి మానసః
హింసావిశిష్టేన హి యజ్ఞకర్మణా
కథం సుసౌఖ్యం లభతే వితర్క్యయ॥ ౧౫

తా॥ 'యజ్ఞాదులు సుఖమనువారికి సమమజ్ఞానులు గలరా' యని నిర్ణయించుకొనిరి.

* శ్లో॥ శ్రీరామభక్తే ర్మహిమా వ్యనన్తో
దృశాం సుపక్ష్మాణి యథాఽవనే సః।
భవాబ్ధినౌకాశ్రిత మోక్షదాతా
శ్రీరామభక్తే ర్మహిమా వ్యనన్తః॥ ౧౬

* శ్లో॥ శ్రీరామభక్తే ర్మహిమా ప్యనన్తో
దృశాం సుపక్ష్మాణి యథా ఉపనే సః।
భవాబ్ధినౌ కా శ్రిత మోక్షదాతా
శ్రీరామభక్తే ర్మహిమా ప్యనన్తః॥ ౧౬

తా॥ "అప్ప రామభక్తియెంతో గొప్పరా" అనుకీర్తనను బాడి భక్తిచే భగవంతుని స్వాధీనమొనర్చి జ్ఞానముచే మోక్షమును లభింపవచ్చుననుకొనిరి.

శ్లో॥ తత్త్యాగరాజోదిత భక్తిమార్గై
స్తత్కీర్తనై స్తుష్టి మవాప యోగీ।
గాఢానురక్తిం రఘురామపాదే
స్థితాం సమీక్ష్యాహ త మార్యపాదమ్॥ ౧౭

తా॥ ఆత్యాగరాజు పలికిన భక్తిమార్గసూచక కీర్తనలకు నూతనయోగి సంతసించి రామభక్తుడగు నాతనితో నిట్లనెను.

శ్లో॥ త్యాగరాజః తవ భక్తినైపుణీ
మాకలయ్య ముదితోఽస్మి మానసే।
రామతారక మనుం భవాంబుధే
స్తారకం బహుసుఖం దదామి తే॥ ౧౮

తా॥ "ఓయీ! త్యాగరాజా! నీయుత్కృష్టభక్తికి నామనస్సులో నానందముగలిగెను. భవతారకమగు రామతారకమంత్రమును నీకిచ్చెదను"

శ్లో॥ ఇత్థం రామషడక్షర మ్మను మతిప్రీ త్యోపది శ్యాబ్రవీ
దేనం షణ్ణవతిప్రమాణగుణిత స్తత్కోటికృత్వ స్సదా

షడ్త్రి శ్త్వం జప తేన తుష్యతి రమానాథస్సతాం పాలకో
భక్త్యా తత్పదసేవకస్య సుతరా న్నాస్త్యేవ భీ స్సంసృతేః॥

తా॥ ఇట్లని శ్రీరామషడక్షరీమంత్రము నధిక ప్రీతితో నా త్యాగరాజున కుపదేశించి 'ఓయీ! దీనిఁదొంబది యారుకోట్లు జపింపుము. శ్రీరాముడు సంతోషింపగలడు. భక్తితో భగవంతుని సేవించువారికి సంసారము వలని భయములేదుగదా? అనెను.

శ్లో॥ త న్మన్త్రి మాసాద్య స గాయకాగ్రణీ
రేజే హుతాజ్యోదితతృప్తివహ్నివత్।
త త్ప్రాప్త్యధృష్యం సమవేక్ష్య మౌనిరాట్
లేభే ముదం చన్ద్ర మివాప్య సాగరః॥ ౨౦

తా॥ ఆమంత్రోపదేశమును బొందిన త్యాగరాజు హుతాజ్యతృప్తిగల వీతిహోత్రునివలె ప్రకాశించెను. దాననా యోగియు సముద్రుడు చంద్రదర్శనమట్లు ఆనందమొందెను.

శ్లో॥ మధ్యాహ్నకాల స్సముపాగతోఽద్య త
చ్ఛ్రీరామపూజాం వినివర్త్య తత్పరమ్
వాదే ప్రవేక్ష్యావ ఇ తీరయన్త్స
తూర్ణాయ గస్తు జ్కృతనిశ్చయోఽభవత్॥ ౨౧

తా॥ "మధ్యాహ్నకాలము సమీపించెను. శ్రీరాముని పూజకు వేళయయినది. దానిని నిర్వర్తించుకొని వాదములోఁబ్రవేశింతము" అని యాత్యాగరాజు లేచిపోవ నిశ్చయించుకొనెను.

శ్లో॥ అత్రాన్తరే తన్నిజధర్మపత్నీ
సమ్ప్రాప్య తత్ప్రాన్త మథోరుభక్త్యా।
ఆతిథ్య మస్యార్పయతాద్య యూయం
కాలోఽప్యతిక్రాన్త ఇతి హ్యవోచత్॥ ౨౨

తా॥ ఇంతలో నాగృహిణి తమ ప్రాంతమును జేరి నాథా! భోజన కాలము సమీపించినది; అతిథిపూజ గావింపగూడదా?" అని పలికెను.

శ్లో॥ తద్వాక్య మాకర్ణ్య జగాద యోగిన
శ్చాతిథ్యకాల స్సముపాగతో ఽద్య నౌ।
ఉత్థాయ కాల్యం వినివర్త్య భోజనం
కర్తుం భవా నేత్వహ మద్య పావనః॥ ౨౩

తా॥ ఆమాటవిని యజమాని యోగితో "నయ్యా; తమరు నాహ్నిక కృత్యమునుదీర్చి భోజనమొనరింపు" డని పలికెను.

శ్లో॥స్నాత్వా హం వినివర్త్య చాహ్నికవిధిం భక్ష్యగ్రహిష్యామిత త్కావేర్యా మవగాహ్య శీఘ్రగమనే నా ద్యాగమిష్యామి భోః।
ఇ త్యస్మై స్వ మపూర్వపుస్తక మసౌ యోగీ ప్రదా యాథతం "సన్నద్ధో భవ! విప్ర! కాల్యవిధయే గచ్ఛామి చే"త్యబ్రవీత్॥

తా॥ "స్నానముజేసి యాహ్నికవిధిని నెరవేర్చుకొని భోజనమొనరింపగలను కావేరీనదికి వెళ్ళివత్తు" ననుచు నీపుస్తకమును దాచు" డని చెప్పుచు వెళ్ళెను.

శ్లో॥ తదీయ సమ్భాషణ మర్థవత్తరం
విశ్రుత్య త స్సమ్మతమాన సోఽభవత్।

స యోగిరా ట్ప్రీత మనా స్తదన్తరే
బభూవ తద్దృష్టిపథా త్తిరోహితః॥ ౨౫

తా॥ యుక్తిసమ్మతమగు నావాక్యమునకు గృహస్థు నంగీకరించెను. యోగియు సంతసించియంతర్ధానమాయెను.

శ్లో॥ నిర్వర్త్య కాల్యం గృహమేధివర్య
శ్శ్రీరామపాదార్చనతత్పరోఽభూత్।
యోగీ స సాయంసమయేఽప్యతీతే
నాభ్యాగత స్స్నాన విధాన గామీ॥ ౨౬

తా॥ త్యాగరాజు మధ్యాహ్నిక కృత్యముల దీర్చుకొని శ్రీరామార్చనతత్పరుడైయుండెను. స్నానమున కేగిన యోగి సాయంకాలముదాటినను ఆతిథ్యమునకు రాక పోయెను.

శ్లో॥ పూజావసానే స చ గాయకాగ్రణీ
స్త్వాభ్యాప్యనాలక్ష్య మన స్యచిన్తయత్।
కిం వా కరిష్యామి కుతో న చాగతః
క్వ వా ప్రయామీతి విచారణే స్థితః॥ ౨౭

తా॥ పూజాంతమందాగేస్తు అతిథియైనయోగి యింతకును రాడేల? నేనేమిచేయవలయును; ఎందువలనరాలేదు? ఎచ్చటకు వెళ్లుదునని విచారగ్రస్తుడాయెను.

శ్లో॥ రాత్ర్యాగమే నాప్య సమాగతో మునీ
రాత్రి శ్చ సాగా దథ భాను రాగతః।
యోగీ న సంప్రాప్త ఇతి ప్రచిన్తయం
చ్ఛ్రీరామ సేవా మకరో త్తదా గృహీ॥ ౨౮

తా॥ రాత్రివచ్చినను అతిథిరాడు; సూర్యోదయమైనను

అతిథి దర్శన భాగ్యోదయము కాదయ్యె ననెడి
వింతతో నాగృహస్థు శ్రీరామపాదసేవ చేయఁ
బూనెను.

శ్లో॥ సాయం పునః ప్రాప్త మనాగతోఽసా
వితశ్చ రక్షే వ్యథయా స గేహీ।
గానేన రామం ప్రవికీర్తయం స్త
త్కాలి న్నయ న్మోహ మవాప శోకాత్॥ ౨౯

తా॥ మరల సాయంకాలము ప్రాప్తమయ్యెను: యోగి
రాడయ్యె; గృహాయజమాని శ్రీరామునకువిన్నవించు
కొనుచు మూర్ఛనందెను.

శ్లో॥ య దాత్తమోహో దుది తోరునిద్ర
స్త దాఽభవ త్స్వప్నగత స్స యోగీ।
ముదా ప్రణమ్యాహ త మాతిథేయో
గురో! భవా న్స్వీకురు తాన్మదర్చామ్॥ ౩౦

తా॥ ఆమూర్ఛలో నిద్రవచ్చెను; అంతలో స్వప్నమున
నాయోగికనుబడెను. వెంటనేనమస్కరించి యాతిథ్య
మునుగొనుమని ప్రార్థించెను.

శ్లో॥ ఆకర్ణ్య వాక్య ్గురుభక్తిసంయుత
శ్చాలక్ష్య త చ్ఛోషితగాత్రసమ్పదమ్।
కారుణ్యభావేన స యోగిపుఙ్గవో
వాచ ఙ్గా దేత్థ మపూర్వగాయకమ్॥ ౩౧

తా॥ గురుభక్తిగలయావాక్యమును, అతిథికొఱకుపరితపించు
నాతనిగాత్రశోషణమును బరికించి వానితోస్వప్నమున
నాయోగి యిట్లని పలికెను.

శ్లో॥ అయి! భూసురవంశచంద్రమః!
కరుణా త్వ య్యజనిష్ట మామకీ।
అహ మస్మి విరిఞ్చనాత్మజ
స్త్వితి జానీ హ్యథ నారద మ్మునిమ్॥ ౩౨

తా॥ ఓయి! భూసురపుంగవ; నీపైనాదయగలిగెను. నేను బ్రహ్మదేవుని పుత్త్రుఁడను; నారదుడను గా గుర్తెరు మని తెలిపెను.

శ్లో॥ తవ గానకలావిమోహితః
పరమానన్ద మవాప్య చాగతః।
కరుణాహృదయేన చార్పితం
య దిదం వేత్తు భవా న్స్వరార్ణవమ్॥ ౩౩

తా॥ నీగానకలకు విమోహితుడనై పరమానందభరితుడ నైతిని; నీపైదయగలిగి సంగీతశాస్త్రమును లోకము నకుఁ బ్రకటింపజేయ నీస్వరార్ణవమను గ్రంథమును నీకిచ్చితిని.

శ్లో॥ వాల్మీకే ర్మునిపుఙ్గవస్య హృదయం భక్త్యాయథా సంయుతం తద్వ త్తావకభ క్తిసంయుత మన శ్చాలక్ష్య తుభ్య మ్మయా ద త్త న్తారకమ న్త్రరా ట్సువిమల స్సఙ్గీతశాస్త్రాన్వితో గ్రన్థశ్చోభయమద్యమాస్తునిఖిలాత్సంసారమోహాద్భయమ్॥

తా॥ వాల్మీకివలె పరిపక్వమగు హృదయము గలవాడవని యెంచి నీకు తారకమంత్రమును, స్వరార్ణవము నొసగితిని. దీననీకై హికాముష్మిక ఫలముగలదు; భయము వలదు.

శ్లో॥ రామతారక జప స్త్వథ కుర్వ
జ్కామజాద్యజనితా జ్జహి రోగాన్।
రాగశాస్త్రజలధిం హృది మథ్నం
స్త్యాగరాజః కుమతా జ్జహి శత్రూన్॥ ౩౫

తా॥ శ్రీరామ తారకమంత్రజపముజేసి కామక్రోధాదుల జయింపుము, స్వరార్ణవపఠనమున శాస్త్రవిముతుల జయింపుము.

శ్లో॥ ఇ త్యుదీర్య మునిరాజపుఙ్గవ
స్తస్య లోచన పథా త్తిరోహితః।
స్వప్నదృష్ట మఖిలం విచిన్తయ
న్విస్మయేన బుబుధే స భూసురః॥ ౩౬

తా॥ ఇట్లాయోగి వచించి యంతర్ధానమయ్యెను. వెంటనే స్వప్నవినివృత్తుడై త్యాగరాజానందపారగుడయ్యెను.

శ్లో॥ ధన్యోఽస్మి జాయే। పరిపూత మస్మ
ద్గేహ మ్పవిత్రం కుల మద్యచాసీత్।
యోఽభ్యాగమత్పూర్వది నే స యోగీ
లోకేశపుత్త్రః ఖలు నారదోఽయమ్॥ ౩౭

తా॥ ఓ ప్రియా! మనగేహమును, కులమును అతిపవిత్రమయ్యెను; మనయింటికి మొన్న వచ్చిన యతడు నారదుఁడు.

శ్లో॥ స్వరార్ణవాఖ్యానకపుస్తక స్త
త్తదీయ మ ప్యర్పిత మస్మదర్థే।
కిఞ్చ ప్రపూతోఽస్మి దయాకృదత్తా
ద్భవాబ్ధిపోతాయితరామమన్త్రాత్॥ ౩౮

తా॥ ఆపుస్తకము స్వరార్ణవమనునది; దానిని మన తాత దర్పించెనట; ఆరామ తారకమంత్ర ప్రదానమునను, ఈగ్రంథ సమర్పణమువలనను నేనెంతగా పవిత్రుడ నయితిని.

శ్లో॥ మ యాఽద్య నిద్రావసరే స దృష్ట
స్తదీయవాచా ఖలు బోధితోఽస్మి।
న చాస్తి సన్దేహ లవోఽపి కశ్చి
త్సచేతిమా పుణ్యపరమ్పరా మే॥ ౩౯

తా॥ నేనిప్పటినిద్రలో స్వప్నమున నీవిషయ మాతనిచే నెఱుకపడి ప్రబోధితుడనైతిని, ఇందుసందేహము లేదు; సత్యముగా నాపుణ్యమంతయు పండినదిగదా?

శ్లో॥ శ్రుత్వాఽతిమోద స్త్వనుభూయ పత్నీ
శ్రీరామభక్తే ర్నప రోఽస్య హేతుః।
సన్దర్శనేనాతి పవిత్రమూర్తే
ర్బుబోధ భర్తేతి మనావ భక్త్యా॥ ౪౦

తా॥ మగడాడిన మాటలవిని యాతనిధర్మపత్ని "నాథా! ఇది యంతయు శ్రీరాముని కృపయే; ఆపవిత్రమూర్తి సందర్శనమున నాభర్తయు మూర్ఛనుండి తెప్పరిల్లెనని స్తోత్రించెను.

శ్లో॥ ఉత్థాయ భూమే ర్నిజగాత్రశుద్ధ్యై
స్నాత్వాఽతిమాత్రాం రఘురామసేవామ్।
కృత్వా తతః పుస్తక మర్చయిత్వా
చకార జాయాసహిత స్సభుక్తిమ్॥ ౪౧

తా॥ అట్లు ప్రబుద్ధుడై భూమినుండిలేచి స్వీయగాత్రమును శుభ్రపరచుకొని రామార్చన నాచరించి యాపుస్తక మునకుఁ బూజచేసి భార్యాయుక్తుడై యన్నమును దినెను.

శ్లో॥ తదాది కర్మాణ్య ఖిలాని హిత్వా
ప్రతిక్షణం రామ మను జ్జప న్సః।
స్వశిష్యవిద్యార్పణచి త్తవృ త్తి
ర్భిక్షైవ భై క్షేణ స చాప్త తృప్తిః॥ ౪౨

తా॥ అదిమొదలుత్యాగరాజు లౌకికముల నన్నిటిమాని కేవలమొక్క రామమంత్రజపమునను, శిష్యవిద్యార్పణమునను కాలమును బుచ్చుచు భైక్షవృత్తితో జీవించు చుండెను.

శ్లో॥ పరిత్య జ్యై వాన్యా ననుదిన మపి స్వాత్మతరణే
సమర్థ స్తన్మ స్త్రి విన్ని యమ మనుసృత్యై వచరతా
య ఉద్దిష్ట స్సఙ్ఖ్యాపరిమిత జ పోఽకారి విమల
శ్శుభ స్తేన శ్రీమద్రఘువర కృపాలోకసదియా॥

తా॥ సర్వవిషయములమానియాత్యాగరాజునియమముతో నా శ్రీరామతారకము నుద్దిష్టసంఖ్యగా నొనర్చి శ్రీరాముని కృపాదృష్టికిఁ బాత్రుడయ్యెను.

శ్లో॥ స్వరార్ణ వాఖ్యానకపు స్తకే య
త్ప్రోక్త త త్సర్వ మనన్యబుద్ధిః।
సరాగశాస్త్రామలదుగ్ధవార్ధిం
ప్రమథ్య లేభేఽమృతవారిధారామ్॥ ౪౪

తా॥ స్వరార్ణవపుస్తకములోని విషయమునంతయు నేకాగ్ర బుద్ధితో పఠించెను; దాననాతడు సంగీతాబ్ధిలోని నవ నీతమును గ్రోలెను.

శ్లో॥ రామానుగ్రహ మేవ మాప్య కరుణాపూర్ణేన తద్యోగినా
దత్తా త్పుస్తక మన్త్రరాజవిభవా దాప్తోరుకీర్తి స్సుసః।
శ్రీరామార్చన కీర్తన స్తుతిపరః కాల న్నయ న్సర్వదా
సఙ్గీతాగమకోవి దోఽయ మితి త ల్లభే ప్ర థాము త్తమాం॥

తా॥ కరుణతో నాయోగియొసగిన రామమంత్రముచేతను, పుస్తకమువలనను పండితుడై యుత్తముడని లోకమున పేరువడసె.

శ్లో॥ త స్యాస్య శాస్త్రాభ్యసనోరుకీర్తి
స్తద్రామ పాదార్చన నైజభక్తిమ్।
తచ్ఛిష్యవిద్యావిషయే ఽనురక్తిం
శుశ్రావ త త్తఞ్జపురాధినేతా॥ ౪౬

తా॥ ఆత్యాగరాజు శాస్త్రాభ్యాసమును, రామార్చనతత్పర తయు, శిష్యాధ్యాపనానురక్తియు నాతంజపుర రాజు చెవిని బడెను.

శ్లో॥ య దాఽఽకుణో త్కర్ణపరంపరావశా
త్తదా ప్రభృ త్యేవ సముత్సుక "స్త్వయమ్।
స్వకీయసంస్థానసతా మ్పురోవిభుః
ప్రగాతు మాయా" త్వితి తం సమాహ్వాయత్॥

తా॥ కర్ణపరంపరగా నాత్యాగరాజు విషయము విన్నది మొదలాతడు తనయాస్థానపు బండితుల నెదుటగానింప నాహ్వానించెను.

శ్లో॥ ఉద_స్త మాకర్ణ్య స గాయకాగ్రణీ
ర్విచి_స్త్య బుద్ధ్యా ఒధిపశాసనాత్మికామ్।
ప్రవృత్తి మత్యా_స్త విరాగమానస
_స్తిరశ్చకా రార్థ మనర్థ దం త్వితి॥ ౪౮

తా॥ ఆరాజంపిన శాసనరూపమగునాహ్వానము నాత్యాగరాజు
విని వైరాగ్యమున 'అర్థమనర్థ' మని తిరస్కరించెను.

శ్లో॥ నిధి స్సుఖం కిం? రఘురామసన్నిధి
స్సుఖ జ్కిః మావేదయ మానసాధునా।
ధనం సుఖం దాశరథేః పదార్చనం
సుఖ జ్కి; మావేదయ మాన సాధునా॥ ౪౯

తా॥ ఆత్యాగరాజు మనస్సులో "నిధిచాలసుఖమా?" అను
కీర్తనను బాడుచుండెను.

* శ్లో॥ సమయః కృపయా ప్రదృశ్యతా
మపరాధా హ్యతిదుస్సహో ను మే।
న పరిత్యజ మూఢ మేవ మా
మతిలోక క్షమ యాధునా హరే!॥ ౫౦

తా॥ కృపఁజూచుటకిదె వేళరామ! అనుకీర్తనచే శ్రీరాము
ని గీర్తించెను.

శ్లో॥ ఏవం స రామా_న్తిక మేత్య గాన
మాశ్రిత్య త త్సంస్తుతి మాచకార
తద్గీతి మాకర్ణ్య తదీయశిష్యాః
కణ్ఠస్థ మాచక్రు రమన్దమోదాః॥ ౫౧

తా॥ ఇట్లాతడు రామునిసన్నిధినిగానించి స్తుతించెను. ఆకీర్త
నలను శిష్యులు విని యభ్యసించుచుండిరి.

శ్లో॥ శరభోజినృపాలకేన య
త్కృత మాహ్వాన మనేన నాదృతమ్।
ఇతి సోదరయో రమన్దరుట్
సమభూ ద్భ్రాతరి గేయకారకే॥ ౫౨

తా॥ తంజాపురాధిపతియగు శరభోజి యాహ్వానమును త్యాగరాజు ధిక్కరించెనని యాతనిపై సోదరులకు కోపముజనించెను.

శ్లో॥ భ్రాతా యమస్మ త్కులగౌరవం వా
నృపాలకాహ్వాన మనన్యగం వా।
నావక్ష్య దిత్యాత్తరు డగ్రజోఽస్మై
భ్రాతా చుకోపార్థ గతాతిలోభః॥ ౫౩

తా॥ మనతమ్ముడు కులగౌరవమునుగాని రాజాహ్వానమును గాని గమనింపకపోయెనని యర్థలోభమునఁ దమ్ముని యన్నలు గోపగించిరి.

శ్లో॥ తత్కోప మాలక్ష్య స గాయకాగ్రణీ
ర్భ్రాతు ర్మనఃపఙ్క విమోచనాయ చ।
శ్రీరామదేవ న్నికషా సమేత్య త
త్సమ్ప్రార్థనా యేత్థ మ థోపచక్రమే॥ ౫౪

తా॥ ఆసోదరుల కోపముఁగని గాయకపుంగవుడు వారిమనః పంకనిర్వారణార్థము శ్రీరాముని సమీపించి యిట్లు ప్రార్థనకు దొడగెను.

శ్లో॥ దాన్తస్య వేదాన్తపరస్య వాపి
శాన్తిం వినా నాస్తి సుఖ మ్మురారే।

సర్వాగమజ్ఞస్య విచక్షణస్య
శాన్తిం వినా నాస్తి సుఖం భవాదేః॥ ౨౫

తా॥ 'శాన్తములేక సౌఖ్యములేదు' అనుకీర్తనను గానము జేసెను.

శ్లో॥ మహాత్మవాక్యా ద్భవిజానతా న్నో
సమ్ప్రత్స్యతే బుద్ధి రతీవ యోగ్యా।
భోగై ర్ద్విమోగై ర్ధనధాన్యయోగై
ర్నోత్పత్స్యతే ధీః ఖలు రామచన్ద్ర॥ ౨౬

తా॥ 'బుద్ధిలేదు బుస్తిలేదు పెద్దలసుద్దులువినక' అనుకీర్తనచే భగవంతునిగూర్చి ప్రార్థించెను.

శ్లో॥ ఏవ మ్ప్రశాన్తో రఘురామపాద
మూలే ప్రశంస న్ననుజోఽగ్రజస్య।
కోపం వినిర్మూలయితుం ప్రవృత్తో
భ్రాతా చుకో పేత్థ మథార్థి కోఽస్మై॥ ౨౭

తా॥ ఇట్లాభక్తుడు రామునిసన్నిధిని తనయన్నగారి కోపము పశమించుటకు(బ్ర)వృత్తు డాయెను, అన్నయు మరింత కోపపడెను.

శ్లో॥ శ్రీరామభక్తే రభవ ద్విమూఢో
మ మాను జోఽసా వితి నిశ్చితాత్మా।
త ద్రామపఞ్చాయతన న్తదీయం
భ్రాతా ముమో షాస్య పరోక్షకాలే॥ ౨౮

తా॥ "శ్రీరామునిభక్తిచే మాతమ్ముడుమతిదప్పిపోయెను" అని యా భక్తునిపెద్దన్న శ్రీరామ విగ్రహములను సోదరున కెఱుకపడకుండ దొంగిలించెను.

శ్లో॥ తత స్స దేవం పరిగృహ్య సహ్యజా
నదీప్రవాహే సమపాతయ ద్రుషా।
అనన్తర గ్గాయకపుఙ్గవో౽ ప్యసౌ
నాలక్షయ ద్దేవ మిదం విచాలయే॥ ౫౯

తా॥ అ ట్లాసోదరుడు తనవిగ్రహముల కావేరినదిలో ద్రోవ
మున పారవైచుట నాతఁడు తెలిసికొనక విచారపడెను.

శ్లో॥ ధి జ్మే జన్మ ధి గస్తు జీవన మిదం ధి గ్బంధుతాం శ్రీహరే
ర్మూర్తిర్యస్య గృహే న చాస్తి సకలానర్థస్య త తత్కారణమ్
ఏవ గ్గాయకపుఙ్గవ శ్శతవిధం సంచిన్త్య జాయాయుత
శ్చాన్వి ష్యాఖిలదేశ మప్యతితరాం దుఃఖం ప్రపేదే. తదా॥

తా॥ "నాజన్మమెందులకు? నాజీవనమేల? ఈ బంధువులెందు
లకు? ఎవనియింట శ్రీరాముని విగ్రహములుండవో
అది సకలానర్థహేతువు" అని యాభక్తుడు భార్యతో
గూడనంతట వెదకి విచారగ్రస్తుడయ్యెను.

* శ్లో॥ జానామి రామ జ్కథ మద్య దేవ
జ్కేహా వ్యథా మాత్మగతాం విదు ర్మే।
కి జ్జన్మనా కిం సుఖభోగభాగ్యై
ర్జానామి దేవ జ్కథ మద్య రామమ్॥ ౬౧

తా॥ "ఎట్లుకనుగొందునో శ్రీహరినే" నను కీర్తనను బాడి
మైమఱచెను.

* శ్లో॥ క్వాస్తి ప్రలీనః కృపయా క దాత్ర
చాగన్తుకామో మనః ఆసహస్వ।
చాపల్యదోష స్త్వజః ధీ స్సమాధా
భక్తార్తిహన్తా క్వను లీనదేహః॥ ౬౨

తా॥ "ఎందుడాగినావో యీడకురా నెన్నడు దయవచ్చునో" యని విలాపముతో గీర్తించెను,

* శ్లో॥ కో భార ఆసీ ద్రఘురామః రక్షితుం
మా మేక మ ద్యాఖిలరక్షకస్య తే।
బ్రహ్మాణ్డకోటీ పరిరక్షకస్య తే
కో భార ఆసీ త్పరిరక్షితు మ్మామ్॥ ౬౩

తా॥ "భోవభారమా? రఘురామా! నను" అనుగీర్తనను శాంతి యాత్రినిభగవంతునకుఁదెలుపుకొనెను.

శ్లో॥ ఏవం విలప్య వ్యథయా స గేహీ
సర్వం విచి త్యాపగత స్వబుద్ధిః।
రామం హృ దాఽఽ హృత్య స మర్చయన్స
స్స్వాత్మాన మ స్తః ప్రథమ న్నినిన్ద॥ ౬౪

తా॥ ఇట్లు త్యాగరాజు దుఃఖముతో సర్వమును మఱచి శ్రీరాముని హృదయమునవర్చించుకొని మొదటితప్పు తనదిగా భావించెను.

శ్లో॥ తత స్స జాయా మ్మ్రవిలోకయం స్తాం
విచారరూప న్నిజగాద వాక్యమ్।
ప్రియే। ప్రయాస్యామి హరిం విచేతు
స్త మ స్తరా తిష్ఠతి జీవితం నో॥ ౬౫

తా॥ తదుపరి నిజభార్యనవలోకించి యా భక్తుడిట్లుపలికెను. "ప్రియా! నేను నాదైవమును విడిచియుండజాలనుగాన యా దేవుని వెదుకఁబోయెద'' ననిపలికెను.

శ్లో॥ యదా మపశ్యామి మదీయదేవ
స్తదా త్మగేహాభిముఖో భవామి।

ఇ తీరయిత్వా నిజధర్మపత్నీ
మన్వేషితుం దేవ మథ ప్రతస్థే॥ ౬౬

తా॥ 'నా దేవుని నేను పొడగాంచిగాని మరల నీ గృహ
మున కభిముఖుడనుగా, నని భార్యతోఁ బలికి దేవుని
వెదక వెడలెను.

శ్లో॥ ధర్మాంబికా రామవిభుం స్మరన్తీ
గృహే వసన్తీ పతి మామనన్తీ।
దివానిశ మ్బుణ్యకథాః పఠన్తీ
కాన్తా ప్రసర ద్గానుగతిం తథాన॥ ౬౭

తా॥ ఆధర్మపత్నియగు ధర్మాంబికయు రాముని, నిజనాథుని
రాత్రింబవళ్లు ధ్యానించుచు భర్తృమనోగతి నింటనే
మెలగుచుండెను.

శ్లో॥ అమృతకలశ మాదౌ దేవసేనాఽవనార్థం
మురహరి రపహృత్య త్యాగీ దివా నాత్మధామ।
గిరిభి దమృతబాష్ప ప్రైః స్రుత శ్చేతి దుఃఖీ
య దభవ దధునాఽసౌ త్యాగరాజోఽపి ఖిన్నః॥

గద్య॥ ఇతి శ్రీ హయవదన పాదారవింద వరివస్యాసాదితో
భయకవితావతా శ్రీ మల్లంకోపనామక శ్రీ సీతారామ
శాస్త్రిణా విరచితే శ్రీత్యాగరాజచరితామృతే
తృతీయస్సర్గస్సమాప్తః



